# SARADA VIJAYAM

BY

**Mrs. D. Satyanathan**

(Approved by the Text-Book Committee.)

**RATHA VILAS**

**No. 39 A. Harrington Road, Chetpet,**

**Madras.**

1935

 [Price As. 14.

# శారదా విజయము

(నవరసభరితమగు నొక చారిత్రక నవల)

(గ్రంథకర్త్రి)

శ్రీమతి దేవసుణి సత్యానాథన్‌గారు

(Revised Edition)



రాధావిలాస్

నెం. 39 A. హారింగ్టన్ రోడ్డు, చెట్పుట్,

మదరాన్.

1935



[వెల 14 అణాలు.

ఓం

# తొలిపలుకు

కళ అనంతము. అయ్యది యనేకరూపముల ననేక మార్గముల స్వైరముగా సంచరించి మనసునకు హాయిగల్పించి జన్మమునకు సార్థకత నొనఁగూర్చును. ఈదారులలోఁ గవితా మార్గము రాచమార్గము. ఈకవిత యనాదినుండి వేదవేదాంతేతిహాసపురాణప్రబంధాది వివిధనామముల్గాఁ గాలపరివర్తనము ననుసరించి మాఱి యిపుడు నూత్నజీవకళల నలరారుచున్నది. ఆనందతాండవమున మైమఱచియున్నది. భావగానము నాటకము నవల యని అభినవకవిత త్రివిధము. ప్రస్తుతము పాఠకులు తెలిసికొనవలసినది యొకనవలనుగూర్చి. దీనిపేరు "శారదా విజయము." దీనిని రచియించినది యొకస్త్రీరత్నము.

సామాన్యమానవ జీవితమందలి రహస్యములను గుర్తెఱింగి యచ్చటచ్చట ననుభవప్రాప్తములగు రసస్పర్శలచేత మానసమును వ్వెత్తుగా నపహరించుచు సంఘోద్ధరణమునకై యందలి దురాచారములను గంభీరముగా నిర్భయముగా నుపన్యసించుచుఁ గల్పన, ఉత్కంఠ, ఊహ తరంగములవలె నొకదానిపై నొకటి పెంచుచుఁ జదువరులకుఁ దమకము పుట్టించి పాఠకులను దన్మయులం గావించి శారదావిషాద సాంగసుకుమార బాణపరంపరగల జల్లుల వెదఁజల్లునది యీనవల?

ఇందలిప్రేమ యనేకకంటక శిలాకఠినసీమల నడుగిడఁగ లేక యడుగిడి—పశుబలము, రాజోన్మత్తత, హృదయకర్కశత మున్న గువానినెదిరించి తుదకుఁ దనప్రాణకాంతుని వలపు పన్నీటిసరసిలో రాయంచవలె బ్రహ్మానందవిహారమున నందన గానము మొలిపించినది. కవితకుముఖ్యలక్షణము శోకము. నిశ్చలము నిర్మలమునైనప్రేమ కెప్పుడు విషాదమే శరణ్యమనుట నిర్వివాదాంశము. అది రసికజనవిదితమేగదా! ఇచ్చట శారద యెన్ని యోయిక్కట్టులుకలిగినను ధైర్యమునువీడక నిశ్చలహృదయయై తనప్రతిజ్ఞను నెఱవేర్చుకొన్నది. పాపము! ఆమెకు విషాదమే యానందము. కష్టమే సుఖము. ఈమెకొఱకు జానకీ సౌఖ్యముసహితము పటాపంచలయ్యెను. సామాన్యుఁడగు సింహాద్రి యోధాగ్రేసరుఁడయినాఁడు. తుదకు సత్యప్రేమ పూర్ణశశాంకబింబమునుంబలె విజయచంద్రికల హృదయాకాశమునంతటఁ బ్రకాశింపఁజేసినది. ప్రేమయనఁగా నిట్టిదే ప్రేమ!

ఇప్పటివలె ఆదినములు సోమరినిదురదినములుకావు. ఆంధ్రాధీశ్వరులు, ఆంధ్రవీరులుఁ దమయప్రతిహతవీరఖడ్గముల రణరంగమున ధర్మముకొఱకు మెఱపించిరి. స్త్రీలు స్వేచ్ఛగాఁ దమతమ హృదయేశ్వరులను వలపుపన్నీట నభిషేకమొనర్చిరి. మానమే ప్రాణముకన్న మేలని యాంధ్రసామ్రాజ్యము గర్వించి యుండెను. వేయేల? అప్పటియాంధ్రులందఱు పిరికికండ లేని

బిరుదుమగలు ! దైవభక్తియే యుత్కృష్టమని త్రిశుద్ధిగా విశ్వసించిన ధీరులు !!

ఇట్లచ్చటచ్చట వెదజల్లి సదారములన్నియుబట్టబయలను ప్రకరణమున ముడివేయఁబడెను. శారదాసింహాద్రులప్రణయ వివాహమునకుఁ గిన్నరులుమ్రోయించినకళ్యాణగీతము జానకీకిఁ గాంక్షసిద్ధి యయ్యెను ! షాహాశ్రీవజీరులకుఁ జావునేళ మయ్యెను !!

ఇందలి శైలి సుకుమారము. పాకము ద్రాక్షాపాకము. భావము గాంభీర్యము. వర్ణనలు రసవంతములు. వ్రాసినదొక సోదరియని సాదరముగాఁ జదువరులుగ్రహించి గుణగ్రహణపారీణులై యానందింతురుగాతమని నమ్ముచున్నాను. ఇట్టివే యింకను ననేక సద్గ్రంథములనురచించి యాంధ్రభాషాయోషను గైసేయ సీకవయిత్రిని నాశీర్వదించుచున్నాఁడను.

S. K KRISHNAYACHENDRA.

The Hon'ble the Kumara Raja Saheb of Venkatagiri.

# విషయసూచిక


| విషయము | | పుట |
|---|---|---|
| 1. | బాటసారులు | 1 |
| 2. | విజయనగరరాజ్యము | 9 |
| 3. | బహామనీరాజ్యము | 20 |
| 4. | ముద్దగల్లుబాలికాపాఠశాల | 27 |
| 5. | ఫిరోజషాహాగారి యనుకంపము | 35 |
| 6. | శారద—జానకి | 41 |
| 7. | ఆకస్మికాపాయము | 52 |
| 8. | సింహాద్రి | 66 |
| 9. | వెన్నెలరాత్రి | 77 |
| 10. | ప్రయత్నము | 84 |
| 11. | విజయనగరము—పౌరమహాసభ | 89 |
| 12. | చేతికందినకబళము నోటికందదయ్యె | 96 |
| 13. | రణరంగము | 103 |
| 14. | ఖాజీపేట | 111 |
| 15. | కపటలేఖ | 120 |
| 16. | శ్యామసుందరునిసాహసము | 126 |
| 17. | సంపూర్ణవిజయము | 131 |
| 18. | విజయోత్సవము | 136 |
| 19. | బట్టబయలు | 138 |
| 20. | వివాహము | 152 |

## Preface to the Second Edition

The enthusiastic reception given to the First Edition of Sarada Vijayamu has encouraged it to make a second appearance with due attention to all healthy criticism.

I gratefully acknowledge my indebtedness to The Hon'ble the Kumara Raja Saheb of Venkatagiri, but for whose kind patronage Sarada Vijayamu would not have reached the public.

My heartfelt thanks are due to Sjt Chirumamilla Sivaramakrishna Prasad Bahadur for his valuable criticisms and suggestions published in the "Andhra Bhumi" for July 1934.

Thanking the public for their appreciation I place the Second Edition of this work before them for their kind acceptance.

The Author.

# విజ్ఞప్తి

మద్విరచితంబులై యాంధ్రలోకంబునకు సమర్పించుకొనఁదలచినవానిలో నియ్యది ద్వితీయగ్రంథము. ఇది యొక చారిత్రక నవల. యావచ్ఛక్తిని వినియోగించి యిందలికథా ప్రణాళికను మనోహరముగా సాగించితిని. నిర్దుష్టమగుగ్రాంథిక భాషనే సర్వత్రనుపయోగించితి. పాఠకమహాశయులను రంజింపఁజేయుట నేను మదీయముఖ్యోద్దేశము. కాబట్టి భావగాంభీర్యము పాత్రౌచిత్యము, రసపోషణము మున్నగువిషయములఁ గొంతం గడుశ్రద్ధవహించితి. సహృదయులగు పాఠకమహాశయు లిందలి పొరపాటులను నిష్పక్షపాతముగాఁ దెలిపిన, ముద్రణాంతరమున వానిని వందనపురస్సరముగా సవరించుకొనియెద. పరోపకారపారీణులగువాంధ్రసోదరసోదరీమణు లిట్టి నాయుద్యమంబునకుఁ దోడ్పడి నన్నాదరించుదురని విశ్వసించుచున్నాను.

గ్రంథమును సాంతముగాఁజదివి తొలిపలుకులిఖియించి నవలకు మెఱుఁగుపెట్టి నన్నుసర్వవిషయములఁ బ్రోత్సహించిన శ్రీ.శ్రీ.శ్రీ. వేంకటగిరి కుమారరాజా సర్వజ్ఞ కృష్ణయాచేంద్ర బహద్దరుగారికిని, గ్రంథరచనకు మార్గదర్శకులై వ్యాకరణాది దోషములను దెలిపి సవరించిమహోపకారమొనరించిన మద్గురువరేణ్యులగు శ్రీ దేశాయి వెంకటరాయుడుగారికి ననేకవందనము లర్పించుచున్నాను.

గ్రంథకర్త.

# సద్విమర్శనము

ఆధునికకాలమున నాంధ్రవాఙ్మయవాహిని పెక్కుదిశలఁ బ్రవహించుచుఁ బ్రశస్తవిషయముల నలవఱచుకొనుచున్న విషయ మెల్లరకు సువిదితమె; కాని యాంధ్రునకు 'వేలంవెఱ్ఱి' యెక్కువ. హిందీభాషయందుఁగల యభిమాన మాతనికి నేఁ డాంగ్లేయముపట్ల కానరాదు. పరభాషను వశపఱచుకొనుట మంచి విషయముగాకపోదు. కాని కేవలము స్వభాషనువిసర్జించి, తెనుఁగునుడికారంపుతీరుతియ్యములను కులుకుందనమును దెలిసికొన యత్నింపకుండుట శోచనీయము. తన్నుమాలినధర్మము లోకమునఁ గలదా? ఏ యితరభాషలవారైన నిట్లు చేయుచున్నారా? స్వభాషనాదరించి యాశ్రయించి దానియందుఁ బాండిత్యమునంపాదించి తరువాతఁ దమకాలమును బరభాషకే వినియోగింపనగు.

ఇట్టిపరిస్థితులలోఁ దమిళదేశమున వలసనెలకొనిన యొక సోదరి స్వభాష ననాదరింపక, తనయోపినకొలఁది "శారదా విజయము" అను నొకచక్కని గ్రంథమును రచియించి తెనుఁగు తల్లికిఁ దగురీతినూడిగమాచరింప నడుముబిగియించుట ప్రశంసనీయము గదా? తమిళదేశమునఁ బెరిగి నిత్యవ్యవహారములందుఁ దమిళభాష నేమాటాడుచుఁ దెనుఁగుభాషయెడఁ దమకుఁగల యభిమానమును దుదముట్టింపనేరక యీరీతి గ్రంథముల నెల యింపదొరకొనిన యీవిదుషీమణి మిగులఁ బ్రోత్సహింపఁబడఁ

దగినది. ఆంధ్రునికి జ్ఞానము, శౌర్యసంపత్తి, కళాప్రతిభ మున్నగు నమూల్యవిషయము లీగ్రంథమునఁ బ్రస్తరింపఁబడినవి. ఈకవి [illegible] ఆంధ్రాభిమానమున కీగ్రంథమే ప్రబలనిదర్శనమై వెలయఁగలదు.

ఇందలికథ 14-వ శతాబ్దమునాటిది. విజయనగరసామ్రాజ్యము పసుపుకుంకుమములతో సర్వసౌభాగ్యములఁ దులతూఁగుచుండిన దినములలో జరిగిన కొన్నివిషయము లిందువర్ణింపఁబడినవి. ద్వితీయప్రకరణారంభమునందలివాక్యము లత్యంతమధురములై గ్రంథకర్త్రియొక్క వచనరచనాపాటవమును విశదపఱచుచున్నవి. తృతీయప్రకరణంబున "బహమనీరాజ్యము" అను నామమెట్లువచ్చెనో చర్చింపఁబడినది. అందు విపులపఱుపఁబడిన పరికల్పనము (Theory) క్రొత్తదారిఁజూపుచు నాలోచనరేపుచున్నది.

ఈ గ్రంథమునందలికథను రెండుభాగములుగా విడఁదీయనగు.

ఒకటి : 14-వ శతాబ్దమునందలిదేశస్థితి ; ఆంధ్రరాజులకు మహమ్మదీయనరపతులకుఁగలవైరము; ముదుగల్లు రాయచూరుదుర్గముల ప్రాముఖ్యత.

రెండు : శారదాసింహాద్రులయొక్కయు—జానకీ హరిహరులయొక్కయు ననురాగము ; ఇందులకుఁదలపడినయూటంక

ములు ; తుదిని వివాహము. ఇందు మొదటిభాగము చరిత్ర నాధారపఱచుకొనియున్నది. రెండవభాగము మొదటిభాగము నాధారముగాచేసికొని పాలలోనినీరువలె లీనమైయున్నది. రెండవభాగము లేకుండినచో నీగ్రంథ మొకచరిత్రమైయుండెడిది! మొదటిభాగములేకున్నచో నొక పుక్కిటిపురాణమయ్యెడిది. అందువల్లనే రెండుభాగములనుగలిపి యొకదానిపై నొకటి యాధారపడియుండునట్లు ప్రజ్ఞావతియగు గ్రంథకర్త్రి పొందు పఱచెను. ఇందలి శారదాపాత్రపోషణ మిక్కిలి చక్కఁగా నిర్వహింపఁబడినది. ఖాజీషాహాలకపటవృత్తి యుక్తియుక్తముగాఁ జిత్రింపఁబడి తత్పతనమునకు దారిఁజూపుచున్నది. "ఎంతటియైశ్వర్యవంతుఁడైనను బలవంతుఁడైనను-నీతిమంతుని హింసింపఁజాలఁడు. సత్యమే సర్వసౌభాగ్యప్రదము" అను నీతి యీగ్రంథమునఁ జక్కఁగా బోధింపఁబడినది.

ఇందలిశైలి మృదుమధురము. సంస్కృతశబ్దము లచ్చటచ్చట విరివిగాఁ బ్రయోగింపఁబడినవి.

"ఖాజీనామమేల ? కాల్పనా ? ఉన్నది మీప్రాపున. తిన్నది మీసొత్తున. కట్టినది మీవసనము. పుట్టినది మొగలాయి మతము. షాహోగారియాశ్రితమీఁదేరనినాఁడు ప్రాణములుండిన నేమి ? బొందిమండిన నేమి ? (పుటలు 39, 40) మున్నగువాక్యములుశైలియందలివేగమును జూపఁజాలినవై యున్నవి. సింహాద్రి శారదకువ్రాసినజాబు (పుట 51) బహామనీసుల్తానుమోల

రాయలవారిరాయబారిపలుకులు (పుటలు 25, 26) మిగుల సత్త్వవంతములై యలరుచు గ్రంథకర్త్రియొక్క ఘనమగురచనా వైభవమును జాటుచున్నవి.

తెనుఁగు మాగాణమునందు నేటికిని వాడుకలోనున్న సామెతలనేకము లీగ్రంథమునఁగలవు. ఇవి గ్రంథమునకెంతయు వన్నె వెట్టుచున్నవి: — "పిలువనిపేరంటము చెప్పనియొక్క ప్రొద్దు (పుట. 48.) లోకులనోళులకు మూకుడామూయ నాతరమా? (పుట 50). ఏపుట్ట నేపాముగలదో యెవరికెఱుక? (పుట 51), ఆత్రగానికి బుద్ధియల్పము (పుట 101), తాఁ దెచ్చుకొన్న తాళ్లు తన్నే గట్ట నుపయోగించె (పుట. 119), ఇట్టివి పెక్కులు కలవు. ఇట్టి యీయుద్గ్రంథమునకు ఆంధ్రభాషాభిమానులగు శ్రీ వెంకటగిరి కుమారరాజావారు పీఠిక రచియించి తమయుదారతను వెల్లడించిరి. ఇట్లే మఱియు ననేకగ్రంథములను వెలయించి శ్రీమతి దేవమణిసత్యనాథన్‌గారు ఆంధ్రభాషా యోపకూశిగమాచరింతురని యాశించుచున్నాను.

ఇట్లు

చిరుమామిళ్ల. శివరామకృష్ణప్రసాదు, బి.ఏ.

రాజభవనము, ముక్త్యాల, కృష్ణాజిల్లా.

15—7—1934.

# శారదా విజయము

## మొదటి ప్రకరణము

### బాటసారులు

క్రీస్తుశకము 1398-న సంవత్సరమున జూనుమాసాంతమున నొకనాఁడు సంధ్యారాగసమయమున దేవరకొండదుర్గాటవీ మధ్యప్రదేశమున కాలిజాడననుసరించి యిద్దఱు తెరువరు లరుగుచుండిరి. వారెచ్చటనుండివచ్చుచుండిరో? ఎచటికేఁగుచుండిరో? మనకిప్పుడు తెలియదు. [illegible]పథికులయెడ భూసురలక్షణము లున్నట్లు తోఁచుచుండెను. ఒకఁడు సంపూర్ణయౌవన విరాజితుఁడు. నడుమునఁ జుట్టిన కావిశాటియు, హరిద్రవర్ణ సంశోభితంబగు యజ్ఞోపవీతంబును, [illegible]భుజముపై వ్రేలాడుచున్న కృష్ణాజినమును, ఫాలాంతమున మెఱయు గోపిచందనోర్ధ్వపుండ్రమును గాంచినవారెల్ల నతఁడొక వటువుఁడని యూహింప సందియము లేకుండెను.

ద్వితీయుఁడు వయసుమళ్లినవాఁడు. మేన చర్మమించుక ముడుతవాఱియుండెను. అయిననేమి? ఆజానుబాహుఁడు. విశాలవక్షుఁడు. వ్రేలికిఁ దొడిగిన యుంగరములును, కంఠసీమ నల్లాడుచుండు స్ఫటికమణిహారమును, స్వర్ణసంభృతములైన రుద్రాక్షవలయకర్ణతాటంకములును, ముందువెనుక కాసెపోసి కట్టిన సీరుకావివలువయు, నొసటనమర్చిన గంధాక్షతలును బరికించిన నతఁడొక గృహస్థుఁడని తోఁచుచుండెను. చీఁకటి పడునని కాఁబోలు వారు వడివడిగా నడచుచుండిరి.

ఇంతలో సూర్యుఁ డపరాంబుధిఁ గ్రుంకెను. గగనసీమ మేఘావృతమై యుండెను. దిగంతపర్యంతమంధకారమలమి రోదసీగహ్వరమున మేఘనిర్ఘోషంబులు ప్రతిధ్వని నీనుచుండెను. ఆకసమునఁ దోఁచుతటిల్లతల ప్రకాశముదప్ప వెలుతురునకిఁక నన్య మార్గము లేకుండెను. వాయుసంచారమాగి వృక్షాగ్రములు చైతన్యరహితములో తపమూనిన మునులో యన నిశ్చలములై నిల్చియుండెను. మేఘాడంబరములకు వెఱచియో కాఱుచీకటుల కలికియో గాని వన్యమృగంబులు భీషణరవంబులను, పక్షికులంబులు కలకలంబులును, మాని మిన్నకుండెను. భీకరారవంబులకాకరంబగు నాయడవి నీ గాఢాంధకారమున వడివడిగా నేతెంచుచుండిన యాపాంథులు తాము పోవలసిన దారిఁ దప్పి యటునిటుఁ దిరుగుచుండిరి.

ఆయరణ్యమున మూఁడుత్రోవ లేగుచుండెను. కేరళము నుండి విజయనగరము మీఁదుగా భాగ్యనగరమునకేఁగు రాచ మార్గమొకటి. ఒరిస్సానుండి హైదరాబాదు మీఁదుగా విజయ నగరమును జేర్చు బండ్లబాట రెండవది. మహమ్మదునగరమునుండి బీదరుమీఁదుగా ముందలకేఁగు కాలిబాట మూఁడవది. ఈ మార్గత్రయ మొకేస్థలమున నొకయాటవికస్థానమందే సంధించును. మన తెరువరు లేత్రోవ నేఁగవలయునో! ఎట్లు త్రోవదప్పిరో! ఆ ఘోరారణ్యమధ్యప్రదేశమున బడి బడలుచుండిరి.

దారి కనఁబడనందునఁ బొదలు దూఁకుచు, నిమ్నోన్నతము లరయక పల్లములఁ బడి పొర్లుచు, నిబిడీకృతముగా నలమికొనిన కంటకములఁ ద్రొక్కుచు, శూలములవలె పాదములందు గ్రుచ్చు

కొన్ని యాకర్కశకంటకములఁ గడుప్రయాసమునఁ దీసివైచి కొనుచుఁ, దళుక్కనిమెఱుపు మెఱసినపుడు దిక్కులు పరికించి త్రోవనరయుచు, దుస్సహబాధావివశులై యొకరిభుజంబు లొకరూతగాఁ గొని యాయటవిఁ ద్రిమ్మరుచుఁ దుదకొకవాఁగును సమీపించిరి.

అది చిన్న వంకగానుండుటచేఁ దమకేయపాయమును బొడమదని దృఢముగానమ్మిన యాపాంథులిర్వురు పైచేలముల నడుములకుబిగించి యుదుచేలములతుద లొకటిగా ముడివేసి యొకరొకరంబులొకరుపట్టుకొని యావాగునందు దిగిరి. శీఘ్రముగా దాఁటుదమనునాతురమున, వడిగా నడుగులిడునంత బురదలో దిగఁబడిరి. అంత పొడిచినుకు లారంభమయ్యె. చెట్లువేళ్లను సమూలముగాఁ బెకలించుచు తరుశాఖల నల్లలనాడించి దూదిపింజలవలెఁ బైకెగరఁగొట్టుచు సవేగమున గాలిపేవ భాండములతోఁ గ్రుమ్మరించినట్లమోఘవర్షము వర్షించె. రాను రాను నీరధికముకాఁగా వాఁగుపూర్ణమై బారఁదొడఁగె. అట్లు ప్రవాహమునఁబడిన పాంథులిర్వురు నోడనడుపుసాధనములవలె చరణములఁ గొట్టుచు, పడవలనుత్రోయు తెడ్లవలె కరములచేఁ దోయముల నుదరముక్రిందికిఁ ద్రోసికొనుచు నెట్టులైనను నీదు కొనిపోయి గట్టుజేరుదుమని తలఁచిరిగాని వాహినీప్రవాహమతిశయింప నిల్వసాధ్యముగామి నదీమార్గమనుసరించిరి. దిక్కులేని వారికి దైవమేదిక్కు గదా? రెండుమూఁడు క్రోసులీడ్లిగి పిదప తోయములు విశాలసమతలమున కరిగెను. నీటియురవడితగ్గెను. వారొకగట్టునకుఁ ద్రోయఁబడిరి.

ఇంతలో వాన వెలిసెను. తమము వీడెను. విహాయసమంతయు ధవళకాంతిచే విరాజిల్లెను. సుధాంశుఁడుఁ జూపట్టెను. పిండియారఁబోసినట్లు చంద్రికాప్రచారమతిశయించెను. జలవిహంగముల కిచకిచ ధ్వనులును, భేకముల కఠోరనినాదములును ప్రబలిపోయెను. తరువుల నాశ్రయించిన పతంగసంతానములు పక్షములు విదిల్చుచు, తెల్లవారె నను భ్రాంతిచేఁ గలకలనాదములఁ గూయఁదొడఁగెను. శీతమారుతములు ప్రబలి తరుశాఖలఁ గదలించుటచే మాటిమాటికిఁ బర్ణాగ్రములనుండి జలబిందువులు జలజలరాలుచుండెను.

వాగునుండి గట్టుచేరిన యధ్వగు లలసి మైమఱచి తీరమునఁబడియుండిరి. ఆ విశాలసమతలముననే కేరళమునుండి విజయనగరముమీఁదుగా హైదరాబాదునకేఁగు రాచబాటయుండెడిది. ఆ వెన్నెలరాత్రులందుఁ దొన్నుద్రోఁగిన వస్త్రములతో మఱియిద్దఱు తెరువరు లామార్గముగా నటకరుదెంచిరి.

వీరు ముసల్మానులు. ఉన్నతకాయులు. సమానవయస్కులు. లాగులను దొడిగికొనియుండిరి. వారి నిలువుటంగరకాలు క్రీపాదములపై జీరాడుచుండెను. చుంగులు జాఱవిడచిన తలపాగలు కడిభుజములపై వ్రేలాడుచుండెను. దీర్ఘ కేశములచేఁ దసరినగడ్డములు ఱొమ్ముభాగమున నృత్యమొనరించుచుండెను. కురువిందమణులుగూర్చిన హారములు కంఠసీమనల్లలనాడుచుండెను. చిన్నపడవలవంటి భిక్షాపాత్రము లవ్వారిహస్తముల వెలయుచుండెను. లోహవలయములచే నొప్పిన నినుపబెత్తములఁ జేతఁబట్టియుండిరి. పోల్చిచూడ వారు ఫకీరులనుట

కెట్టి సందియమును గానరాదు. వీరపుడా దారినడచినవారనితోఁచెడి. బిరబిరనరుదెంచి సమీపముననుండు నొకశిలామండపము ముందరివేదికపైఁ గూర్చుండిరి. మార్గాయాసవివశులగు తెరువరులకా దద్దళము మంచి విశ్రమస్థానమై యుండెను. నిర్మల వారి పూరితమగు నొకసరసి యాచావడికెదుటఁగలదు. బాటసారుల బడలికలు దీర్పచల్లని నీడనొసఁగు వృక్షజాతములును, కుటజచ్ఛాయలందలి శిలావేదికలును, నందందుఁ గన్పట్టుచుండు.

తడిసిన తమవసనములఁ బిండి గాలికార వేసిరి. వడివడిగా వీఁచు శీతలానిలవశమున పాపమాయధ్వగులు గడగడ వడఁకుచుండిరి. చలిబాధ మిక్కుటముకాఁగా నిట్లు సంభాషింప మొదలిడిరి.

ఈఁదురుగాలి వీవఁదొడంగె. వణఁకుమెండయ్యె. కాలుసేతులు కొంకరలు వోవుచున్నవి. చలిగాచుకొనుటకు చెత్త నేరుము. చెకుముకిఁగొట్టి నిప్పు వెలిగింతును.

అందందు చెత్తకుప్పలున్నవిగాని యవి వాననీటఁదడిసినవి. మండపమందేవేని వంటచెఱకులున్నవేమో గాంచుము. వంటకొఱకు ప్రయాణికులు తెచ్చినవి మిగిలియుండును.

ప్రథముఁడు మండపమును ప్రవేశించెను. మూలలు పరిశోధించెను. కొంచెమెండుగడ్డియు పేడపిడకలు నొకమూలనుండుటనుగని చెకుముకనిగొట్టి నిప్పువెలిగించెను. బాటసారు లిర్వురు చలిగాచుకొనుచుండిరి. అంత వారిలో నొకఁడు చంద్రికాప్రసారమతిశయించుటచే దద్దళమునకుఁ గొంతదూరమేఁగెను. స్మృతి పీడిపడియున్న బ్రాహ్మణాధ్వగులచెంత కేతెంచెను.

నిర్మలవాయువు లాఘ్రాణించుటచేతను, శరీరమందలి తడియారుటచేతను, దేహమున రక్తప్రసారమారంభమై యప్పుడపుడే వారికి స్మృతిరానుండెను గాని మాటాడఁ బ్రాణలేకుండిరి. ఒకరినొకరు విడబాయకుండుటకై కట్టుకొన్న చేలబంధము నీటిచేఁ దడసి బిగిసియుండుటచే నొకరిప్రక్క నొకరుపడియుండిరి. కాళ్లను గదలించుచుఁ గరములనేలఁగొట్టిరి. మనఫకీరా చప్పుడాలించెను. అతనిమానసమునకు జంకుజనించెను. కాఁబట్టి తన నెచ్చెలిని బిగ్గఱగాఁజీరెను. అతఁడే తేర నిర్వురు నామూర్ఛితుల సమీపించిరి. వారట్లే మఱలమఱలఁ బాదములఁ గదలించుట చేతుల నేలగొట్టుటయుఁదప్ప మఱిమాటాడుటగాని, సైగ జేయుటగాని, కనుదెఱచుటకాని గానరైరి. కొంచెమాలోచించి, నాడినిఁబరీక్షించి, సజీవులని తెలిసినపిమ్మట ధైర్యమూని, చేలబంధమును విడఁదీసియిర్వురు చెరియొకరి నెత్తుకొనిపోయి మండపముఁజేర్చిరి.

ప్రథముఁడు మఱికొన్నిపూరెనిపుడకలనుఁ బోగుచేసెను. చెత్తచెదారము నేఱితెచ్చెను. అదివఱకే తాము చలిగాచుకొన్న యగ్నిని మఱింతప్రజ్వలింపఁజేసెను. ద్వితీయుఁ డామూర్ఛితుల నటునిటుఁ గదలించెను. నడుములకుఁ బిగించిన చిన్నముళ్లను విడఁదీసెను. ఆ మూటలందుఁ గొన్నిరొట్టెలును, వారుధరించెడి యుడుపులును, రెండు సత్తుడబ్బీలు దప్ప మఱేమియునుండలేదు. ప్రథముఁడు మంట సధికముజేసి తగరపు భరణియందేమున్నదో చూతమని మూఁతనెడలించెను. ద్వితీయుఁడును నట్లేచేసెను. ప్రథమునిచేతికొకరాగిరేకు రక్షాయంత్రమువలె జుట్టులుచుట్టి

నది చిక్కెను. ద్వితీయునకు తాటియాకుపుట్టయొకటి దొరికెను. వానినివిడఁదీసి వెలుతురునందుఁ దిలికించునపుడు గంటముచేవ్రాయఁబడినకొన్నియక్కరములు వారికంటఁబడియె. తరువాత వారిట్లు సంభాషించిరి.

అన్నన్నా ! వీరు ప్రయాణికులని పొరపడితిమి.

అవునవును. వీరు సామాన్యులుగారు. మహాయోధులు. వీరి రహస్యపుజాడలేయుందులకు నిదర్శనంబుగా నున్నవి. వీరికి స్మృతియున్నదో ? లేదో ? గనుఁగొనవలయు.

అది యొంతటిపని యనియొక కొలఁదిసేపుగొని మొగము నెగాదిగఁ దిలకించి, యుచ్ఛ్వాసనిశ్వాసములను నాడీచలనమునుబరీక్షించి, ప్రథముఁడు—ప్రాణములున్నవి స్మృతిమాత్ర మింకనురాలేదు.

అయిన నీలేఖలనుగొని మనకొల్లకు బుద్ధి జెప్పుటయే సమంజసము.

ఏల? సేచులకు వెఱచియా? వీరెనిందేమట్టుపెట్ట పోవుదము. భయమేమి? అదిగో నాచేతికత్తియందిమిడ్చిన గుప్తిపొటుఁ జెమ్ము. ఈ యిర్వుర నొక త్రుటిలోఁబొడిచిచంపెద.

అదియా కార్యము? దూతనువధించుట రాజధర్మమగునా? వీరు సజీవులై పోయి తమస్థితిగతుల మొఱవెట్టుకొనవలయు. అందు పైగాదె సిద్ధాంతరాద్ధాంతము లెక్కడగు ! చంపిన నేమున్నది?

అట్టుగాదు. ఉరగముగంటఁబడినపుడు చంపకవిడిచితి మేని సమయమెఱిఁగి చలముపట్టికఱవకమానునా? ఏటిమాట ? చేఁజిక్కినపుడు శత్రువును తుదముట్టించుటయే ధర్మము.

రాచకార్యములం దారితేరిన యనుభవజ్ఞుఁడవుగాని వాఁడవగుట నీవిట్లనుచుంటివి. నీ ప్రయత్నముడిగి పయనము నకుఁ ద్వరపడుము.

పథికులిర్వురు తమత్రోవఁ దామేగిరి. జలమును వీడి కాలాతీతమగుటచేతను, చిచ్చును ప్రజ్వలించెడి నిప్పుసెగ మేను లకుఁ దాకుటచేతను, చలనశక్తిగాననికీళ్లపట్టులు సడలి యా మూర్ఛితుల కంతకంతకు స్మృతిగల్గెను. లేచి కూర్చుండి యొద విన యాపదనుగూర్చి చింతిలుచుఁ దమ్మాశ్రమమండపముఁ జేర్చిన ప్రాణరక్షకులదయార్ద్రబుద్ధిని మఱలమఱలఁ దలపోయుచుఁ బాడమిచేతక్షుధాతురత నడఁచి దమవద్దిముల్లెల విప్పిచూచిరిగాని పదిలముగా దాచినతాళపత్ర తామ్రరేఖలు లేమికి వెఱఁగంది తమ్ముఁ బ్రాణముతో విడకమ్మలను మాత్రము గొన్న యోధు లెవరని యాలోచించి యాలోచించి చేయునదిలేక గమ్య స్థానముఁ జేరఁబోయిరి.

---

# రెండవ ప్రకరణము

## విజయనగర రాజ్యము

మహాశయులారా! మన మనస్సుల నొకమారాఱువదు నాల్గవశతాబ్దమునందునిల్పి భావప్రపంచమున నొకగంతులోఁ గన్నడరాజ్యమును దర్శింపవలసియున్నది రండు.

అల్లవిగో! అంజనాద్రి, మాల్యవంతము, మతంగ పర్వతము, ఋశ్యమూకము మున్నగు భూధరములు సాంద్రనీల జలధరమాలలచే నావరింపఁబడియున్నవి. ఉన్నతోన్నతములగు శిఖరాగ్రములచేఁ దనరి యున్నవి. అంబరమును చుంబించునట్లు దోఁచుచున్నవి. కొండకోనలనుండి క్రిందికిజాఱు సెలయేళ్ల మర్మర ధ్వనులు గుహామూలములనుండి ప్రతిధ్వనులీనుచున్నవి. భోగినులు పైకెగఁబ్రాకుగతి నీరధారలు దళుకుటల ప్రచారమును జాటుచున్నవి. తరుసమూహములచే నిండి నిబిడీకృతంబులగు నడవులందందుఁ గన్పట్టెడు. కుటజపాదపముల మయూరనర్తన మానందమును గొల్పెడి. ఆబర్హి క్రేంకారంబులు కర్ణకఠోరంబులై చెవులుతూఁట్లువడఁజేసెడి.

ఒకవంకఁ బంపాసరోవరము! ఒకచాయ వాలిభండారము! ఒకదెస కిష్కింధ! వేఱొకప్రక్క సీతాసరోవరము! ఇంకొకదెశ శ్రీరామచంద్రుని పర్ణశాల!

ఆహా! త్రేతాయుగమందలి రామాయణకథనంతను జ్ఞప్తికిఁ దెచ్చెడి యీరామణీయకప్రదేశప్రదర్శనమెంత మనోహరము! మనోవిశ్రాంతికై మన మీదుర్గాటవీపర్వతాగ్ర

ముల విశ్రమించి సేదఁదీర్చికొందము. భావదృక్కులచే సృష్టి వైచిత్ర్యమును మాత్రమేగాక యందలి వైభవమునుసహితము కనుగొందము.

ఓహో! ఇది నైసర్గికరామణీయకమగు దుర్గరాజము. పార్శ్వత్రయలవణజలధిపరివేష్టితంబగు ద్వీపకల్పము. ఇదే! చాతుర్దశక్రోశలంబమానమై, యోజనాయుత వైశాల్యమగు కర్ణాటకరాజ్యరమాలలామ ఆంధ్రరాజసంపాదితయగు సాధ్వీమతల్లి. విద్యారణ్యనామాంకితవిబుధజనాహ్లాదవల్లి. విద్యానగర నగరరాజము. త్రయోదశశతాబ్దమధ్యకాలమున, మాధవవిద్యారణ్యుల ప్రేరణమున, హరిహరరాయమహాశిచే వినిర్మితమయిన విద్యానగరము! వేదశాస్త్రపురాణేతిహాసాదివిద్యలకెల్ల నాలయమై యాదివిద్యానిలయమని ఖ్యాతిగాంచిన నగరము. వేఁట జాగిలములు పలాయనముగా జడుపొందఁజేసి తొలుదొల్తఁ దమమగటిమిని వెలిపుచ్చి జయంబుఁగొన్న శశసమూహములే యాంధ్రసామ్రాట్టుల విజయాభ్యుదయమున కెయ్యది విక్రమ విహారప్రదేశమని సూచించిన విజయనగరము. మొగలువాహిను లకుఁ జెలియలికట్టయై యతిక్రూరులగు నరాతివీరులరుధిరధారలు వెల్లువలుగాఁ బ్రవహింపఁజేసిన విజయనగరము. రామదేవోగ్ర నరసింహ విరూపాక్షాలయంబులకాలయమై యాంధ్రశిల్పరచనా కౌశలమును వేనోళ్ల వివిధగతులఁ జాటుచుండెడి విజయనగరము. మహోన్నతములగు నంతస్థులతోఁ గగనలక్ష్మితో వియ్యమందెడి రమ్యహర్మ్యవితానములు. వాహినియే యగడ్తగాఁ గల్గి బహిఃప్రాకారములపై రక్షకభటులు గాపుండనమర్చిన బురు

జులు ఎల్లెడలం జల్లని నీడలొసగు వృక్షవాటికలచేనొప్పిన రాచమార్గములు. నందనోద్యానములకెనయగు నారామ వాటికలు. మారుతవేగమపహసించెడి తురంగములుండు లాయములు. గిరులకెనయగు కరీంద్రములుండుగజశాలలు. జనులకు నిత్యాన్నసంతుష్టినిడు భోజనశాలలు. లెక్కకుమించిన బొక్కసంపుభవనములు. విపణిమార్గములు. పేరోలగములు. ఆహా యిదియెట్టి యుచ్చదశయందున్నది? భూలోక స్వర్గమా యిది యనిపించునట్టిదిగా నున్నది. ఇందలి పౌర సుందరపురంధ్రీలలామలు భువనైకమోహినులు. నిస్సంశయము. వర్ణనాతీతము.

కర్ణాటకరాజ్యరమామతల్లీ! విజయనగరసామ్రాజ్య లక్ష్మీ! నేడుగాదె నీసూనులు ధన్యులు. ఇపుడుగాదె వారు మాన్యులు. మాతా! నినుజేపట్టినమహారాజు హరిహరులా? మొదటి బుక్కరాయల కాతఁడు మనుమఁడు. రెండవ హరిహర రాయల కగ్రసూనుఁడు. చిక్కరాయవిరూపాక్షరాయల కగ్రజుఁడు. అతఁడు ధీవిశారదుఁడు. అరి బలవిరాముఁడు. సాహసాంకుఁడు, సద్గుణమూర్తి, సుజనానువర్తి, వివేకస్ఫూర్తి, దయాదాక్షిణ్యసమవర్తి. ఇట్టి చక్రవర్తినిఁ జేపట్టిగాదె నిత్యోత్సవములఁ బచ్చతోరణములఁ మెప్పుఁగనెడి నిన్నుఁగన్న నేయాంధ్రునికన్నుల పండువుగాకుండు? ఎవ్వడానందరాశి నోలలాడకుండు? ఎవ్వాఁడు వేనోళ్ల నీయశోరమను వినుతించకుండును?

పాఠకులారా! మన యాంధ్రసామ్రాజ్యమందున్నాఁడో కనుంగొనవలసియున్నది. ఆరామమునలేఁడు. పేరోలగమునఁగానము. అంతిపురమున పట్టమహిషియగుగౌరాంబిక చెంతలేఁడు.

ఎంతటిగియుండును? రాయలసభాభవనమునకుఁ బ్రాగ్భాగమం దుండునది విలాసమందిరము. భవనమతి విశాలయుతము. అది మూఁడంతస్థులసౌధము. స్ఫటికశిలానిర్మితంబగు కుడ్యజాలములు ప్రతిప్రదర్శకములై నయనోత్సవ మొనరించుచుండును. పాలగచ్చుచే నలమినద్వారపార్శ్వములు ముకురకాంతులఁ నపహరించుచుండును. నలువలంకులందును చిత్రవిచిత్రములుగా నేర్పడిన ద్వారములు వివిధవర్ణములచే నింద్రధనువు నధఃకరించుచుండును. ఆయర్ధవలయముల మార్గమున సుమారుతమును ప్రకాశమును నంతర్భవనములందుఁ బ్రవేశింప హాయియు నుత్సాహమును నొక్కమారే పెనంగొనుచుండును. అంతర్బాహ్యప్రాంగణమంతయు ప్రహరిచేఁ దనరినలతామందిరములచేతను, చలువచప్పరములచేతను మెప్పుగొల్పుచుండును. సంధ్యారాగసమయమునందు వికసించిన బొండుమల్లియల సువాసనల నాకర్షించిన మలయమారుతము హర్మ్యతలమంతయు సూనసౌరభముచేఁ గమగమలాడుచుండును. సౌధోపరిభాగంబున పన్నీటిచెట్లయందు గులాబి ప్రసూనములచేనొప్పిన కంచులోహపుతొట్లు పలుదెసల గలశములెత్తినపగిదిఁ గనులపండువ వొనర్చుచుండును. మధ్యాంగణప్రదేశము స్ఫటికశిలామండపము చిత్రవిచిత్రములగు నాసనములచే శిల్పిరచనాకౌశలమును బ్రకటించుచుండును. గంగాశంతనుల యపారమగు ప్రేమానుబంధమును వెలిబుచ్చు ప్రతిమలును, రాధామాధవుల యనురాగమును సూచించు చిత్రములును, నందనందనుఁడు గోపీవస్త్రాపహరణం బొనర్చినట్లు లిఖించినఫలకమును, రాసక్రీడయం దండజికన్ని

రూపులై తోఁచిన కృష్ణలీలావినోదపటమును, కరుణారసప్రపూ
ర్ణులై మెలంగిన యహల్యా జాభారులచ్ఛాయారూపఫలకములును, అప్రమోదభవనమున ప్రేలాడుచుండెను. రాచకార్యములఁ జిత్తములనుంచి కొలువువీడిన వెంటనే రాయలు మానసోత్సాహమునకై నగరు సొచ్చి పాదప్రక్షాళనాదికృత్యముల నిర్వర్తించి, సూర్యుఁ డస్తాద్రికిఁ జేరఁబోవు సమయ మెఱిఁగి, పాదచారులై రేతెంచి యామండపమునలంకరించుటవాడుక. రాజబంధువులు మంత్రులు నున్నతోద్యోగులు పౌరులు మున్ముందే యరుదెంచి రాజురాకకై నిరీక్షించుచుండును.

రాయలకత్యంత కౌతుకమును గూర్చు వేఁడుక చెలికాఁడు విభావసుండు. రాయలెంచఁగిన విభావసుండు నతనివెంట నరుదెంచుచునే యుండును. మంత్రిగూడను రాజకార్యముల ముగించి కొంచె మెడపుగాఁ జనుదెంచి సభ నలంకరించెడు వాఁడు. నాఁడు విభావసునిగాని యామాత్యునిగాని వెంటఁగొనక [illegible]ంటరిగా నరుదెంచి [illegible]చావడియందు సుఖాసీనుఁ డయ్యెను. సభ్యులందఱు వినయ వినమితోత్తమాంగులై రాయలకు జోహారు లొనరించి సముచితాసనములఁ గూరుచుండిరి.

ఆహా! మాణిక్యఖచిత స్వర్ణకంకణాలంకృత! పుష్యరాగమణిసంయుతనాసికాభరణభూషిత! మౌక్తికమణిమయానేక కంఠాభరణ సుశోభిత. వజ్రతాటంకసంయుతకర్ణయుగళ. ధగద్ధగాయమాన వైడూర్య విలసితకనకకాంచీబంధవిరాజమాన. పాదద్వయరజతశింజనీగణగణారావప్రచారి. కాశ్మీరకౌశేయాంబరధారిణీ. జరీవసనకంచుకసమేత. మందహాససుందర వదనాగ

నింద. కుందకుట్మల దంతధావళ్య. ప్రవాళాధరి. భృంగవర్ణసదృశవినీలకుంతలకలాప. అరవిందపత్రనేత్ర. లలాటకస్తూరీతిలకవిరాజమాన. పరిపక్వనింబఫలచ్ఛాయాసమన్విత తనూవిలసినియగు నొకవిలాసిని తనుగనుజనాళికామోద మొనఁగూర్చుచు, తిన్నినడకలఁదనవయొయ్యారమును గనఁబఱచుచు, సపాంగవీక్షణముల విటులమానసము లపహరించుచుఁ, జీరసవరింపుచుఁ, బైటఁ జక్కనొత్తుచు, సభాగారమును బ్రవేశించి రాయలకును సభ్యులకును నమస్కరించి నిలిచెను. వైభవోపేతయై జగన్మోహినివలె నిల్చియున్న యమ్మత్తకాశినిఁగాంచి రాయలాదరభావమున నిట్లనిరి.

వసంతసేనా! ఒకరాగమాలాపించి వీనుల విందొనర్తువా?

దేవరవారేరాగమాలాపింప ననుజ్ఞనిత్తురో?

కాలము ననుసరించి రాగము.

కాంభోజిరాగము కాలానుకూలమగు రాగము.

దానినే ప్రారంభింపుము.

వసంతసేన సంగీతము ప్రారంభించెను. విపంచిక చేతఁగొనెను. వీణతంతులు సవరించెను. కంఠస్వరమునకు తోడుశ్రుతిఁజక్కఁజేసికొనెను. విఘ్నాధిపతులఁ బ్రస్తుతించెను. కాంభోజిరాగ మాలాపించెను. కంఠస్వరమతిమనోహరమైనది. చెవులకింపు గూర్చెను. గాత్రధ్వని క్రమక్రమముగా హెచ్చెను. పంచమశ్రుతినిదాఁటి షడ్జమంబున రాగము లీనమగుచుండెను. దక్షిణ కరాంగుళులు వీణకాయపై తాళమానముల సూచించు

చుండెను. రాయలు దలయూఁచుచుండిరి. సభ్యులానందించు చుండిరి.

ఔరా ! గానకళామహిమ ! సభ్యులమానసములు చలింపని స్థితియందున్నవి. రాజునిర్విణ్ణుఁడై మైమఱచుచున్నాఁడు. శుకములు జాలిఁజెందినవి. కోకిలములు గూయిడ వెఱచినవి. ఏమి యాగానమాధుర్యము ! ఏమి యారాగాలాపనాతిశయము ! ఏమి యావసంతసేననిమీలితనేత్రములయందలి కళాప్రపూర్ణత ! ఏమి యాపణ్యాంగన జగ్గునిగ్గులు ! ఏమి యాలేమయంగ సౌందర్యాతిశయము ! ఏమి యాకలికి క్రేఁగంటిచూపులు ! అందఱి నన్నివిధముల గానానందమున తన్మయులఁ గావించెను. మంగళగీతమున గానముముగింప రాయలనుమతియయ్యె. వసంతసేన, మంగళమునుబాడిన యనంతరమున సంగీతమాపఁబడియె. రాయలయనుజ్ఞఁగొని సభ్యులొక్కరొక్కరుగా వెడలిపోయిరి.

విభావసుఁడు రాయలకు వేఁడుక చెలికాఁడని ముందే నుడివియుంటిమి. అతఁడిపు డరుదెంచెను. రాయలు, సేనయు మాత్రమే యందుండిరి. వసంతసేనకు విభావసునందు చనవు మిక్కుటము. విభావసుఁ డెల్లపుడు రాయలప్రత్యక్షమున సేనను, హాస్యమాడుచుండువాఁడు. ఆ పరిహాస మొక్కొక సమయమందుఁ బ్రమాదముగా మాఱుచుండుటయుఁ గలదు. వారాంగన కినుకకు విభావసుఁడు పాత్రుడగుటయుఁ గలదు. ఇర్వురివివాదముల రాజు వారించుటయుఁ గలదు.

విభావసుఁడు సభాభవనమందొక యాసనముపైఁ గూర్చుండెను. అతనిదృష్టి ప్రసారమొకమాఱు రాజుపైఁ బ్రసరించెను.

జెప్పవాల్చనియావీక్షణముచే నాతఁడు గొంతవడికళ్లే యాలోచనమందు మునింగె. ఆదృష్టి చలించి వసంతసేనపైఁ దిరిగె. ఆచూపునం దేదో యొక నూతనభావమున్నదని చూపరులకుఁ దోఁచుచుండెను. తన్నట్లు పాఱఁజూచు విభావసునిఁ గాంచి వసంతసేన యిట్లనెను.

నీకేమి పిచ్చిపట్టినదా? నాకు దృష్టి పోవునేమో? నీ చూపిక్కని వేఱొకచోటికి మఱలింపుము.

ఉన్నవారిద్దఱు. నాకున్నది చూపొక్కటి. రాయలను ముందే చూచితిని. ఇప్పుడు నిన్నుఁ జూచుచున్నాను. నాదృష్టి పథమున కలంకారవస్తు వింకేదియుఁ గానరాలేదు. మఱేమి చేయుమనుచున్నావు? విభావసునిరాఁకను గాంచి యేమేమో యనఁగ నాతురులై యున్న రాయలు వీరిసంభాషణ లాలించుచు ముసిముసినగవు నభినయించుచుండెను. విభావసుఁడును వసంతసేనవాగ్ధారల కానందపడుచుండెను. వానినివారింప రాయల కిష్టములేదు. గాన నతఁడూరక వినుచుండెను. విభావసుఁడును వసంతసేనతో మఱల పరిహాసమునకుఁ బ్రారంభించెను.

ఇంతలో గుండయామాత్యుఁ డరుదెంచెను. రాయలు వసంతసేనను కనుమీటిరి. సేన వెడలిపోయెను. పాపము మంత్రి రాకడచే వసంతసేనబహుమానమాఁగిపోయెను! పిమ్మట నారాజమంత్రు లిట్లు సంభాషించిరి.

రా.—ప్రచ్ఛన్నవృత్తి, విశేషముల కెడమిచ్చినదా?

మం—లేఖాద్వయము లభించినవి.

రా.—ఎచ్చటివవి ?

మం.—మొగలుసుల్తానుఁ డంపినసందేశమునకుఁ గేరళాధీశుఁ
డొసఁగిన సమాధానమొకటి.

రా.—రెండవది ?

మం.—సుల్తాను ఓరుగంటిరాజున కంపినసందేశము.

రా.—ఇవి మీకెట్లుదొరకె ?

మం.—కృత్రిమపువిప్రవేషధారులగు మొగలులయొద్దనుండి.

రా.—సునాయాసముగవారినుండి యెట్లువానినిఁగొనఁగల్గితిరి ?

మం.—మతిదప్పిన మాయాయోధుల శోధించికొంటిమి.

రా.—వారట్లు స్మృతిపిఁడఁగారణము ?

మం.—నెల్లువఁబడి యెట్లోతీరముచేరి మూర్ఛితులై యుంటిరి.

రా.—అందేమున్నదో వినిపింపుము.

మం.—ఇది కేరళ నరసింహరాయలు సుల్తానునకుఁ బంపిన సమా
ధానము.

మీసందేశము నొదలధరింపఁజూచితిని. మీరు విజయ నగరముపై దాడివెడలుట కులపర్వతముపై తగరుడీకొనువిధమై తుదకు ప్రయత్నము పరిహాసాస్పదమగును. అందుచే ననర్థముల కాకరులరగుదురు. ఇది నాదృఢమగునమ్మకము. కార్యసాధనము నకుసమాధానమే సమంజసమగుమార్గము. ముద్దగల్లు రాచూరు నందలి ప్రజలు మీపాలనమునకె నంగీకారులగుటకుఁ గారణము మీ లోపమేయగు. దాని సవరించుకొన్న, కదనమనావశ్యకము.

దాక్షిణ్యమునకెడమిచ్చి యిచ్చకపుమాటల నుత్సాహపూరితు లఁజేయుటకంటెను, నిజమునునిరూపించి కార్యశేఖరమునకుఁ దారిఁగూర్చుటయే యుభయరాజ్యముల శాంతికి మార్గదర్శక మని నాముఖ్యాభిప్రాయము.

ఇట్లు

కేరళము. కేరళ నరసింహారాజు.

రా.—అమాత్యా! ఈసమాధానముత్కృష్టమైనది. వ్యర్థము కానిది. శాసనాపథమును తప్పకఁచాటుచున్నది. ఈ లేఖామూలమున నరసింహారాయలు సుల్తానునకుఁ దోడువడఁడని తెల్లమైనది. ఓరుగంటిరాయలకంపిన సందేశమునుగూడ నాలింపఁ వేఁడెద.

శ్రీయోరుగంటి కృష్ణదేవులకు.

సామంతనృపతీ! విజయనగరపుగూఢచారులకుట్రలందు ముద్దగల్లురాయచూరుదుర్గములందలి ప్రజలేకీభవించి, మాపాలనమును తృణీకరించుచున్నారు. విజయనగరముపైఁ దాడివెడలి పొండూరు బంగాపురదుర్గము లాక్రమించినఁగాని వారి కుట్రలణగవు. ఈవారముకడపట మీసేనలతో మాకుఁదోడ్పడ నేతేరవలయు. ఒడంబడికననుసరించి యెనిమిదవవంతు కదనపు ఖర్చుల మీరుభరింప బద్ధులు.

ఇట్లు, పిరోజిషాహా

దౌలతాబాదు. సుల్తాన్.

అమాత్యుఁడు సుల్తానుసందేశమును జదివి వినిపించెను. రాయలమోముదమ్మి యరుణకాంతులఁ గ్రక్కుచుండెను. కను బొమలుముడివడియెను. గాత్రమదరఁజొచ్చెను. సరోషమున మఱలనిట్లనెను.

రా.—కాలమపాయమును సూచించునపు డరిమర్దనమాచరణీ యము. ఏమరితిమా సిలుగుల జిక్కుటనిక్కువంబు. శత్రువులు ప్రబలుకొలఁది రాజ్యము స్వస్థతఁగాం చదు. ప్రజలుబాగుపడరు. తామసింపక త్వరపడుట సన్మార్గము.

మం.—ముద్గల్లురాయచూరు దుర్గముల ముట్టడింతము. అందలి పౌరులుఁగూడ మనయాశ్రయమునే కోరు చున్నారు.

రా.—సరిహద్దుదుర్గములు విజయనగరములోనివనియు, వానిని మాకువదలకుండినచో నీవారము గడచినపిమ్మట ముట్టడింతుమనియు నేడే మొగలు సుల్తానునకు సందేశమంపుము.

మం.—చిత్తము.



# మూఁడవ ప్రకరణము

## బహామనీరాజ్యము

మనమిపుడు బహామనీరాజ్యమునుగూర్చి యించుక తెలిసికొనవలసియున్నది. పౌరాణికయుగమునుండి పరంపరగా భారతీయులచేఁ బరిపాలింపఁబడుచుండినఢిల్లీ రాజ్యము స్థానేశ్వర యుద్ధానంతరము పృథ్వీరాజుతో నడుగంటిపోయెను. విదేశీయులగు మహామ్మదీయరాజులవశమై ఢిల్లీరాజ్యలక్ష్మి శోకింపఁ జొచ్చెను.

క్రీస్తుశకము 1347-వ సంవత్సరమునమహామ్మదుటోగ్లాకు ఢిల్లీసామ్రాజ్యమునకు నిరంకుశాధికారియయ్యెను. ఈ నవాబున కాస్థానపండితుఁడుగంగూయను బ్రాహ్మణుఁడు. ఇతఁడమితవిద్యా విశారదుఁడు. జ్యోతిశ్శాస్త్రవేత్త. ఈపాఉనినాశ్రయించిన బానిస "హసన"నువాఁడు. ఒకనాడు క్షేత్రమును దుక్కిసేయుచుండ హసనునకు ధనముదొరకెను. స్వార్థత్యాగపరాయణుండగు హసను ఆ[illegible]బ్బికి తానర్హుఁడుకాఁడనియుఁ, దనగాత్రముపరులకు విక్రయించుటచే నాద్రవ్యము తనయజమానునికిఁ జెందవలసినదనియు, సత్యమందుదృష్టినిల్పుట జన్మసాఫల్యమునకు మార్గమనియు నెంచి తద్ధనమును తనస్వామికి సమర్పించెను. వాని యుదారస్వాంతమునకు భృత్యధర్మమునకు సంతసించిన యాతని యేలిక వానినిశ్చలత్వమును నవాబునెదుటఁగీర్తించి యున్నతోద్యోగము లభింపఁజేసెను. బానిసత్వమునువదలి చననున్నపుడు చేరఁబిల్చి "హసనూ! నీకు రాజ్యప్రాప్తియున్నది. అదిలభించి

నపుడు ననుమఱవకుసుమా! నీకు శుభంబొనఁగూడునుగాత పోయిరమ్ము" అని యాశీర్వదించిపంపెను. గంగూయనుజ్ఞఁ గొనివెడలినహాసను పెక్కుగదనంబుల విజయమాపాదించి, యనల్పకాలమున ఢిల్లీశ్వరునిమెప్పించి, జాఫర్ ఖానను బిరుదమును బొందెను. కాలముగలసి వచ్చినఁ బట్టినది బంగారమౌ ననువారోక్తి నిజముగదా! భాగ్యశాలియగు జాఫర్ ఖానుఁడు శీఘ్రకాలమునందే స్వతంత్రరాజ్యమును స్థాపించి పాలింపఁ జొచ్చెను. ధనలక్ష్మిచేఁ దులఁదూగుచున్నను, రాజ్యలక్ష్మిని నిరంకుశముగాఁ బాలింపుచున్నను, తనయున్నతపదవికి హేతుభూతుఁడగు యజమానునిమాత్రము మఱచినవాఁడు గాఁడు. ఢిల్లీనగరముననున్న గంగూనురావించి సగౌరవంబుగా గౌరవించి యతనినిఁ దనకోశాధ్యక్షునిగా నియమించెను. అంతటితోఁ దృప్తిఁగనక తనవంశమునకు బహామనీవంశమనియు, తనరాష్ట్రమునకు బహామనీరాజ్యమనియుఁగూడ సార్థకనామంబుల నొసఁగెను. బహామన్, బహ్మన్ శబ్దములు బ్రాహ్మణశబ్దభవములగుట బ్రాహ్మణరాజ్యము (లేక) బ్రాహ్మణునివలన లభించిన రాజ్య మనునర్థమిచ్చు బహామనీరాజ్య మని హాసను నూతన రాజ్య మేర్పఱచెను.

ఈ మహాపురుషుఁడు కాలదేశపాత్రలననుసరించి హిందూ రాజులచెలిమినెఱపి కొంతకాలమును, గపటవర్తనలవారితో వైరమూని కొంతకాలమును, విక్రమోపేతుఁడై పదునొకండు వత్సరములు రాజ్యపాలనంబొనర్చి కాలధర్మమునొందెను. ఇట్లే

ర్పడిన యీనూతనరాజ్యమంతయు మహారాష్ట్రరాజ్యములోని దని నొక్కిచెప్పనగు.

ఉత్తరమున నర్మదాస్రవంతియు, దక్షిణమున కృష్ణాతరంగిణియు, తూర్పున నాంధ్రదేశమును గోండువనములును, బశ్చిమమున సహ్యాద్రిపర్వతములును నెల్లలుగాఁబఱగు ప్రదేశమే బహమనీరాజ్య మనఁబడెను. రాజధాని గుల్బర్గాపట్టణము. దీనికి హసనాబాదనిమారుపేరుండినది. హసనుగంగూ అల్లాఉద్దీన్ షాహామరణానంతరమున నతనికుమారు లిర్వు రీరాజ్యపాలనం బొనర్చిరి. అందు మహమ్మదుషాహా పదునేడు వత్సరములును, దావూదుషాహాయొక్క వత్సరమును రాజ్యమేలిరి. మహమ్మదుషాహా యోరుగల్లువినాయకదేవునిపైఁ దండెత్తిరాఁగా వినాయకదేవుఁడు రత్నములచేఁ జెక్కఁబడి యాంధ్రదేశశిల్పకళానైపుణ్యమునుజూపెడి నాలుగుకోట్లరూప్యముల విలువచేయు పుత్తడిసింహాసనమునుగానుకగానొసంగెను. బహమనీసుల్తానులందఱికినినాపసిండిగద్దియయే యాసనమయ్యెను.వీరికితర్వాత మామూదుషాహా పందొమ్మిదివత్సరములురాజ్యముఁజేసెను. ఇతనిపాలనానంతరమున బహమనీరాజ్యనిమిత్తమై గుల్బర్గాపట్టణమందు జ్ఞాతులకు వివాదమొదవినకారణమునఁ గొందఱు సుల్తానులు చంపఁబడిరి.అత్తరుణమున నీబ్రహ్మరాజ్యమైదుభాగములయ్యె. అందహమ్మదునగరము, బీరారము, బీజపూరు, బీదరు, గోలకొండ యనునివియే యారాష్ట్రవిభాగములు. క్రీ. శ. 1837-వ సంవత్సరమునఫిరోజిషాహాయనునాతఁడు సుల్తానులనుబిరుదమూని

రాజ్యమున కభిషిక్తుఁడయ్యెను. ఇతఁడే మన కథాభాగమునకు మార్గదర్శి. ఇతఁడు హిందూమతద్వేషి. అరిజనభయంకరుఁడు. ఆజానుబాహుఁడు. దీర్ఘదర్శి. ఇతని యొజ్జ ఖాజీ. అల్లరులకెడ మీఁక షాహాగారికార్యములను నిర్వర్తించుటయం దితఁడద్వితీయుఁడు. అతిచతురుఁడు.

వేసవికాలమందొకనాఁటి యపరాహ్ణమున ఫిరోజిషాహా యెప్పటియట్లు పేరోలగమునఁ గొలువుదీరియుండెను. మంత్రి సామంతదండనాయకాద్యఖిలపరివారవర్గము తన్ను పరివేష్టించి యుండిరి. అపుడు వజీర్ మియర్‌జాన్ ఉల్లాయును, ఒజ్జయగు ఖాజీయును నెచటనుండియో యచటికే తెంచిరి. వారిఁ గాంచిన షాహా గంభీరభాషణముల గద్దించియిట్లనెను.

షా.—వజీర్! ఓరుగంటి కేరళాధీశులకంపిన సందేశములకు సమాధానమేమయినది?

వజీరుని మోము వెలవెలపోయెను. ప్రత్యుత్తరంబివ్వఁదోఁపమి నధోముఖుం డయ్యెను. షాహానుసమాధానపఱచు సదుపాయమెద్దియనిఁ జింతిలదొడఁగెను. ఆలోచనంబుఁదోఁపమి స్తబ్ధుఁడై నిలిచియుండెను. ప్రత్యుత్తరము వెడలమికాగ్రహావేశమొంది మఱల షాహా యిట్లనెను

షా.—చెవుడువట్టెనదా? లేక మామాటలువినుపించుటలేదా? ప్రశ్నకు ప్రత్యుత్తరంబొసఁగ నింత యాలస్యమేల?

వజీరునుండి మాంటరామికిశంకించి ఖాజీ దనచూపులను షాహోగారిపై పునకు వెలయించెను. ఇరుకరంబులుజోడించియిట్లు విజ్ఞాపనంబొనర్చెను.

ఖా.—నవాబుగారు మావిన్నపమాలింపవలయు. పొరబాటున ప్రమాదమొదవుటచే ప్రయత్నసఫలులముగాక పోయినా రము. ఈసారి మన్నింపఁ బ్రార్థితులు.

షా.—ప్రచ్ఛన్నవేషములు బయలయ్యెననిఁ దోచెడి.

వీరిట్లుమాట్లాడుచుండిరి. బయటనుండి యొకభటుండరు దెంచి విజయనగరమునుండి రాయబారి యేతెంచినాఁడని విన్న వించెను. సందేశహారుఁడుపేరోలగమునకురా షాహోసెలవయ్యెను. దూతయరుదెంచి సుల్తానునకు సలామొనరించి యిట్లనెను.

సుల్తానుగారికి యీరాయబారి వందనమర్పించుచున్నాఁడు.

ఎక్కారణంబున నిక్కడికి నీరాఁక?

విజయనగరాధీశులగు రాయలవారంపిన సందేశమును వినిపింప నేతెంచినాఁడ.

సందేశమెక్కడ?

ఈదూత తనధర్మమునువాగ్రూపమున వివరింపఁగలఁడు.

అదేమి? లేఖరులులేరైరా? లేఖలుఁ గరవయ్యెనా?

విజయనగరపురాజులు గతిలేనివారుకారు. లేఖామూల మునఁ దెల్పుసందేశమునకంటెను వాగ్రూపముగఁ దెల్పుసందేశమే విషయముల స్పష్టీకరించునని వారి దృఢమైనవిశ్వాసము. పిరోజి షాహదృష్టి సందేశకునియెడఁ దీక్ష్ణముగఁబ్రసరించెను. భృత్యుఁ

డతి భాషియని కోపమతిశయించెను. దీర్ఘోచ్ఛ్వాసముననొక నిట్టూర్పువెలయించి యిట్లనెను.

అతిభాషణములు చెల్లవు. ఇదిషాహాగారి యాస్థానమని మదినెంచుము. ప్రజ్ఞగల్గివర్తింపుము. నీమనవిని విన్నవింపుము.

సుల్తానుగారుహొరబడుచున్నారు. ఈదూతవిజయనగరపు రాజులపంపునుమనవిఁజేసికొనుటకై యరుదెంచినవాఁడుగాఁడు. ఇష్టమున్న సందేశమునంతను సాంగముగా వినిపింపఁగలఁడు. కష్టమైనఁగడమాటల నొకటిరెంటినే చెప్పిముగించఁగలఁడు.

నవాబుదృష్టిపథమున రాయబారినిలుచుటయేయిష్టములే కుండెను. సందేశమును వినవలెనను నభిమతంబుమాత్రము తీవ రించుచుండెను. దూతనువధింపనాజ్ఞాపించుటదుష్కృత్యముగదా యని మానసమాలోచించుచుండెను. సందేశమునకెట్టి ప్రత్యు త్తరంబొసంగిక మంత్రివంకఁ జూపుమఱల్చెను. ఆసంచు దెలసి అమాత్యుఁ డారాయబారితో నిట్లనెను.

రాయబారీ! నీసందేశమును వినిపించి వెడలుటకేదేని యభ్యంతరమున్నదా? అతిశయోక్తులవలని లాభమేమి?

వాదప్రతివాదకుల సందేశసమాధానములకేలిక లుత్తర వాదులుగానిదూతస్వధర్మమునుమాత్రమే నెరవేర్చుకొనవలసిన వాఁడు. విజయనగరసార్వభౌముల సందేశమును ఈవిధముగా నీమ్రోల విన్నవించుచున్నాఁడ.

మృగయులు అగ్నిపక్షులవేటాడ వెంబడించిరి. అవిశక్తి కొలఁదితప్పుఁగాచుకొనబ్రయత్నించెను. ప్రయత్నమువిఫలమగు టయెగాక బలముఁగూడఁగోల్పోయెను. లావుదొరుగ దిక్కుదో

పమిసైకతమునశిరమునుఁగప్పిపుచ్చెను. వేటకాండ్రచేఁజిక్కెను. (ఇదియొకవిషయము).

క్షీరముష్ణాధిక్యతను జెందియుండెను. బిడాలముపాలఁద్రావఁగాఁచియుండెను. ఇతరులు తనఁజూచిన దండింతురను జడుపు. పాలఁదాకినమూఁతిగాలు ననుభయము. కనుమూసి గ్రోలినకష్టమొకవదనిదాని యాశయము. క్షీరమును స్పృశించినది. మూతి గాలినది. (ఇది రెండవవిషయము).

పొదరింటసింగము నిదురగూరియుండెను. అడవులయందు లేళ్లు విహరించుచుండెను. ఆటవికులుజింకలను బట్టవలలనుఁదోపుచుండిరి. వలఁదగులక హరిణములు హర్యక్షముండు పొదను జేరెను. మృగపతిమేల్కాంచెను.జింకలుచేఁ జిక్కెను. కేసరిమృగముల వెంబడించె. (ఇదిమూఁడవది).

సందేశము ముగిసినది. విషయములెట్లన్వయించుకొన్నను సరే. నేఁటికైదవనాఁడు హరిహరరాయలు ముద్గల్లును ముట్టడింతురు. విశేషమిఁకేద్దియుఁ గానరాదు. సెలవొసఁగిన వెడలువాఁడ.

మీరాజు సందేశమమోఘమైనది. ధైర్యమజేయమయినది. అట్టివారియందేనునునొక్కరుఁడనని మీ రేని కెఱిఁగించుము. సేనాసమేతులమైయే తెంచి ప్రత్యర్థిగానిల్చి రణమాచరింతుమని మాప్రత్యుత్తరమును దెల్పుము. పోయిరమ్మని పాహి సెలవొసంగెను. చిత్తమని సందేశహరుఁడు వెడలిపోయెను.

పాఠకులారా! ఈసందేశహరుఁడెవరని యాలోచింతురేమో? మనహరిహరరాయల వేఁడుకచెలికాఁడగు విభావసుఁడే!

---

# నాల్గవ ప్రకరణము.

## ముద్గగల్లు—బాలికాపాఠశాల.

ముద్గగల్లురాయచూరుదుర్గము లాంధ్రరాజులపాలితంబులై యీతరుణమున మహమ్మదీయరాజుల వశమైబహామనీసుల్తానులచేఁ బరిరక్షింపఁబడుచుండెను. ఈదుర్గములు పరమపావనియగు తుంగభద్రాస్రవంతి కుత్తరతీరముననున్నవి. యవనవీరులకును నాంధ్రశూరులకును వాదప్రతివాదముల కాటపట్టులై తుదకు రణరంగములకూఁతలై రక్తధారలఁ బ్రవహింపఁజేసి ప్రసిద్ధచారిత్రమును జాటుచుండెడి వీదుర్గరాజములు. రాయచూరుకంటెను వైశాల్యముం గొప్పదై చుట్టును పరిఘగల్గి—యరులకభేద్యమైనది ముద్గగల్లుదుర్గము. సుల్తాను ఫిరోజిషాహాగారి సోదరుఁడగు యువరాజ మహమ్మదుషాహావల్లి గురువు ఖాజీతో ముద్గగంటినిఁజూడనరుదెంచెను. యువరాజుగారేతెంతురని నాఁడాపట్టణమంతయు నూతననము గానలంకరించియుండిరి. షాహాగారు పురివీధిగుండా పాదచారులై యరుదెంచిరి. నారికేళశాఖలచేతను రంభాస్తంభములచేతను సింగారింపఁబడిన యొకమందిరపుముంగిట 'యువరాజుగారిని దేవుఁడాశీర్వదించుగాఁత' యని లిఖించిన యొక ఫలకమునుగాంచిరి. రఘునాథశర్మ అహమ్మదుగారికి వందనమర్పించి లోనికివిజయముచేయఁబ్రార్థించెను. విశేషమెద్దియోయని లోనికరిగిరి. అది బాలికాపాఠశాల. స్త్రీవిద్యఁగఱపెడియుపాధ్యాయుఁడే రఘునాథశర్మ. యువరాజుగారు

తమకై యమర్చినయాసనముపై నధివసించిరి. పదునేనుమంది బాలికలు మాత్రమందుండిరి. కొందఱు బాలికలు. కొందఱు ద్వాదశవత్సరప్రాయులు. మఱికొందఱు నిండుజవ్వనులు. అందఱు నవివాహితులు. సౌందర్యమునెడఁ బక్షపాతమువహించి యుండిరి. రాజాశీర్వాదమును బాడిరి. అందఱైక కంఠ్యముగాఁ బాడిరి. అవ్యక్తమధురస్వరముతోఁ బఠించిన యాగీతము యువరాజును నానందపరవశునిఁ జేసెను. ప్రేక్షకులు హర్షించిరి. శారద సర్వవిద్యా విశారద. ప్రవిమలగుణప్రసాదియగు విద్యకు తోడు వినయము. అణకువకుఁదగిన యోగ్యత. కేతకీసుమమునధిక్షేపించు తనుచ్ఛాయ. తొలఁకాడుచున్న నిండుజవ్వనమునకు తోడు గానకళాకౌశలము. తీఁగ చిగురించినది. మాణిక్యము సువర్ణఖచితమైనది. మొగ్గవికసించినది. తావి సుమము నాశ్రయించినది.

శారద మంగళగీతమును బాడునట్లాజ్ఞచే ననుజ్ఞాత యయ్యెను. ఒంటరిగఁబాడుట కామెకిష్టములేకుండెను. ప్రారంభింపుమని తోడి బాలికలు మెల్లమెల్లనఁ బాడువసాగిరి. అందఱు నామెగీతమునే వినవేఁచియుండిరి. సాహెబుగారు పాటనాలింపఁ గాచియుండిరి. ఒకవంక బాలికల రహస్యపుమందలింపులు. ఒకవంక నుపాధ్యాయులయాజ్ఞ. పాపము శారద యింకేమి చేయఁగలదు? ధైర్యమునుబెంచి, జడుపునుదోలి, కలస్వనంబుతో నెలుఁగెత్తి, సాంతముగా, గీతమును ముగించెను. ఎల్లరాగానకళాకౌశలమున కచ్చెరువందిరి. సాహెబుగారత్యంతానంద భరితులైరి. ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్నుముట్టెను.

బాలికయొకర్తుక కుసుమమాలను ఆహమ్మదుగారి కంఠ సీమ నలంకరింపఁ జేయు శారదకొసంగెను. శారద యనంగీకార భావమును సూచించుచుండెను. షాహాగారిదృష్టి శారదపైఁ బ్రసరించియుండెను. శారదయనంగీకారము నాతఁడు గ్రహించెను. బాలికల గుసగుసలు ప్రబలెను. నీవు నీవని వారొండొరులఁ బ్రోత్సహించుచుండిరి. వైనముఁ దెలియ యువరాజు ఖాజీని కనుమీాలెను. ఆయుదంతమంతయు షాహానడిగి ఖాజీ తెలిసికొనెను. అతఁడు రఘునాథశర్మ చెవిలోనేమో గుసగుస లాడెను. ఉపాధ్యాయుఁడు బాలికల గద్దించి యిట్లనెను.

ఉపా.—శారదా! కూర్చుండుమనది యువరాజుగారు. జరుపునది ప్రభుభక్తి. నడుమ నీవేడుకలేమి?

శా.—ఆర్యా! ఏనెట్టినేర మొనరించిన దానఁగాను.

ఉపా.—అయిన యువరాజుగారి కంఠసీమ హారమలంకరింపనాలస్యమేల?

శా.—అది నావల్లనయినపనిగాదు. అక్కార్యంబొనర్ప మఱేరి నేని నియమింపుఁడు.

రఘునాథశర్మమోము వెలవెలఁబోయెను. అతఁడొకపరి షాహాగారినిఁ దిలకించెను. మఱియొకపరి శారదమోముఁ బాఱఁజూచెను. శారద యిట్లు కఠినముగాఁ బ్రత్యుత్తరమిచ్చునని యాతఁడెఱుఁగడు. ఇపు డతనికాలోచన మతిశయించెను. కఠినముగా మఱల నాజ్ఞాపించిన నాజ్ఞాభంగమగునేమో యని యతనికి సందేహముదయించెను. ఏమి చేయఁగలఁడు? ఏదియెట్లున్నను షాహాగారిని సత్కరించుట యాతనివిధియగుట నిట్లనెను.

"కమలా! నీ వీహారమున రాజుగారి నలంకరింపు" మని యుపాధ్యాయుఁడు హార మొసంగెను. ఆజ్ఞయని కమల యా మాలనుగొని యువరాజుగారి కంఠమున వేసెను. అందఱును జప్పటలు చఱచిరి. రాజుగారిమోమున సమాధానభావము సూచించలేదు. మోమునందేదో యొక విధమగు చింతదగిలినట్లు గోచరించుచుండెను. ప్రేక్షకు లందఱు స్వస్థానములఁ జేర నరిగిరి. ఖాజీ యితర బాలికలమందిరముల కనుచునదిగను, శారదను మాత్రమింకను గొంతకాల మందే యుంచునట్లును నుపాధ్యాయున కాజ్ఞాపించెను. ఏమి ప్రమాదమావహిల్లునో యను శంకలువయించుచున్నను నాజ్ఞనుమీఱఁజాలక బాలికలందఱ మందిరములకనిచి శారదా! నీవించుకనిల్వుము. మన మిర్వురము మందిరముల కరుగవచ్చునని రఘునాథశర్మ శారదను హెచ్చరించెను. తన్నొక్కతెనందు నిల్పుటకు హేతువుతోఁపక శారద సంశయాకులిత మానసయయ్యెను. ఖాజీశారదనుజేరి యిట్లనెను.

అమ్మాయీ! నీ యుపాధ్యాయుల యాజ్ఞోల్లంఘన మొనరించిన నేరము. నీయందారోపింపఁబడకమున్నె షాహా గారిని మన్ననవేఁడుట యుచితము.

నావిష్ణుః పృథ్వీపతిః యను న్యాయముగలదు. లోకపాల నాధ్యక్షులగు యువరాజుగారు ఈబీదరాలికించిల్లోపమును మన్నించకుందురా? క్షమింతురని నావినయపూర్వకంబగు వందన నమర్పించుచున్నాను.

శారద వినయవిజ్ఞాపనమున షాహాంగారిమానసము ద్రవీభూతమయ్యెను. అపారమగుప్రేమకుహృదయము చోటిడియెను.

అంతట నిల్వక యాకరుణ మెల్లొక్కసాగెను. పాహా శారదకిట్లు ప్రత్యుత్తరం బొసంగెను.

జవ్వనీ! నీవేడికోలుననుసరించియీయాలోపమునుమన్నించి నను నింకొక గొప్ప నేరమున నీవుత్తరవాదివిగా నున్నదానవు. దానిఁగూర్చి ఖాజీగారు నినుఁ బ్రశ్నింతురు. సమాధానము జెప్పుము.

చిరప్రసన్నమగు శారదమోముదమ్మి దీనభావమునకు దావలమయ్యెను. మృగయులయురులందు బడ్డ హరిణశాబకమురీతి నయ్యెనని తనసంకటమునుగూర్చి యామెభీతిలుచుండెను. ఖాజీ నోటినుండియెట్టిప్రశ్న వెడలునో? దానికి సదుత్తరంబివ్వ తనకెద్దియేనియుపాయమున్నదో? లేదో? యనియామె మానససూందోళసముద్రం దూఁగుచుండెను. ఖాజీ శారదనీరీతిఁబ్రశ్నించెను.

యువరాజుగారు నీకెట్లగుపడుచున్నారు? నీచే హారమలంకరింపఁబడుటకుఁ బాత్రులుగారా? వారికి కంఠాభరణంబుగా మాలనలంకరింప నీవేల వెనుదీసితివి?

శారద యవనతముఖియయ్యెను. ఆమె గుండియతటతటఁ గొట్టుకొనసాగెను. మేనంతయు వణఁకున కిరవయ్యెను. ప్రత్యుత్తరముతోఁచమి దీర్ఘాలోచనాతత్పరయయ్యెను.

మఱల యువరాజిట్లనెను.

యువతీ? ఖాజీగారిచ్చిన ప్రశ్న చెవిఁ బడినదా? సమాధానమున కాలస్యమెందుకు? ప్రత్యుత్తరము సమంజసముగా నుండకున్న కఠినదండనకుఁ బాత్రురాలవగుదువు.

అబలలమానసములతిచంచలము. పరిపరివిధముల నవి చరించుచుండును. భీతికధీనమైన శారదమానసము ధైర్యము వహించె. ఎటులైననుప్రత్యుత్తరం బివ్వకున్న విధిలేమి మానస మందలి సంశయముల నామెత్రుంచివైచెను. వచ్చిన యాపదల ననుభవింపకతీరదని మానసమున దృఢీకరించియిట్లనెను.

ఆంధ్రయువతీమణులు స్త్రీసమాజముల కరుగుదెంతురు గానిరాజసభలనుజేరఁబోరు. విధిలేకయొకవేళ బోవఁ దటస్థించె నేని వయసుఁజెల్లిఁవృద్ధాంగన లెగుచుందురుగాని నాబోటిజవ్వ నులరిగి యాసభలందునిల్చుటయు, మాటాడుటయునెఱుఁగరు. సభాధ్యక్షులగుమీబోఁటి పాహేలకుసన్మానముఁలోనర్పఁబురుషు లేకార్యనిర్వాహకత్వమునుబూనియుందురు. ఏను స్త్రీసామాన్య నగుటను, నిండుజవ్వనము నాయందు పొడచూపుటచేతను, భారతీయాచారములననుసరించినదాననగుట నిక్కముగానికా ర్యంబునిర్వహింపనైతి. అద్దానఁబొడమిన తప్పిదమనర్థమునిచ్చు నెడ నీదీనయువతిని మన్నించి రక్షింపఁగలందులకు యువరాజు గారు ప్రార్థితులు.

ఖాజి.—ఒకవేళ రాజుగారే నినువరింప నిశ్చయించిన ?

ఈ మాటవిని శారద పిడుగుపడ్డదానివలె నిర్విణ్ణ యయ్యెను. ఆమెమానసమున విషయసందేశము లుదయించెను. ఇయ్యది యనిష్టసంఘటనమని యామెబుద్ధి సాటిసాక్ష్య మిచ్చు చుండెను. ఒకవంక వ్యాకులత. ఒకవంక జడుపు. ఒకవంక ధైర్యము ముప్పిరి గొనుచుండ నిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

శార:—వారక్లేల పిలవిత్తురు? నవయావనసంపన్నులగు స్ఫుర ద్రూపశోభనాంగులెందఱో యంతిపురికాపరులై యెడతెగని శుశ్రూషలననురాగమును గూర్చుచుండ వారి పదనఖమునకేని సాటిరాని నాయట్టి సామాన్యపై వారేల వలపుఁగొందురు?

అహ:—ఇది గర్వోక్తి. వారందఱు నీ కాలిగోటికి సరిరారని నీయాశయమగుట మేమూహించుచున్నాము.

శార:—మీరట్లూహించుటయు నాపురాకృతపాపమే.

ఖాజీ:—పాపపుణ్యములందలి సత్యాసత్యంబులు పరిశీలించు ప్రభువువే నీపైఁదమిఁగొని నిన్నాదరింపఁజూచిన, తృణీకారభావమును సూచించుట శిరిరా మోకాలొడ్డువిధమని మాయభిప్రాయము.

శారద మిక్కిలి చదువరి. పతివ్రతల పవిత్రచరిత్రముల నామె చదివియుండెను. స్వర్ణభూషణాంబరము లనిత్యములని యామె యెఱింగియుండెను. పదవీప్రతిష్ఠలై హికాడంబరము లని యామెకుఁ దోఁచియుండెను. లభింపనున్నసుఖము హేయమైనదని యామె గ్రహించెను. స్వమతాభిమానమే సర్వోత్కృష్టమైనదని యామె నిజమైన విశ్వాసముగా నుండెను. తరుణమందీ విషయములన్నియు పరంపరగా నామెమానసమున వికసింపసాగెను. ఆలోచనమతిశయించుకొలఁది నావరించిన జడుపంతయు మయ్యెను. నూతనాంశములు పొడఁగట్ట ధీరచిత్తయైయిట్లనెను.

శార:—రాష్ట్రపాలనాధురీణులు ప్రజలకుఁ దండ్రివంటివారు. దాంపత్యానుకూల్యమునకును ననురాగమునకు సమాధానము సద్ధర్మము. షాహాగారి పాలనము నకు లోనైన నేను వారి బిడ్డలయందొక్కర్తెను. ఈదీనురాలి విషయమం దన్యథా భావింపక పుత్రీ భావమున నాదరించుటకై మఱలమఱలఁ బ్రార్థించు చున్నాను.

ఖాజీ, శారద మనస్థైర్యముల కచ్చెరువందెను. ఏరీతి వంచింపఁబడఁగలదను నాలోచన మాతనిమానసమున నొప్పిఁ బెంచుచుండెను. ప్రయత్న సాఫల్యమునకు మార్గమారయ నాతఁడాతురుఁడై యుండెను. యువరాజుయొక్క మనోభీష్ట మెట్లీడేర్పనగునని యాతఁ డూహింపసాగెను. షాహాగారి మాన సము శారద మృదుమధురోక్తులందే లీనమగుచుండెను. తన యభీష్టము నెఱవేఱునో? నెఱవేఱదో? యనుసంశయమునఁ జిత్తచాంచల్య ముదయించెను. వ్యవధిలేని నిట్టూర్పు లారంభ మయ్యెను. అదిగాంచి ఖాజీ మఱల శారదతో నిట్లనియెను.

శారదా! ఎంతబేలవు? ఇంకొక మారాలోచించు కొనుము. ధనలక్ష్మిచే నుయ్యెలలూపఁబడువారు సుల్తానులు. రాజ్యరమను బాలించువారు నవాబులు. అనవరత సుఖదాయ కులు బాదుషాలు. ఇట్టి ఘనులఁజేపట్టిన నీవైభవము వెలలేని

దగును. నీయదృష్టము పండినదగును. నీజన్మము సార్థకమగును. ఏమందువు?

శార:—దేవేంద్రవైభవమైనను శీలవతులకవి తృణసదృశములు. మీ రేమయినఁ జేయుఁడు. ఇందులకే నంగీకరింపను.

ఖాజీ:—అంగీకరింపకున్న బలవంతముగాఁ జెఱఁగొందుము.

శార:—మ్లేచ్ఛులచే బడక యగ్నిఁబడి తమశీలతనుఁగాచికొన్న హైందవనారీరత్నంబుల పవిత్రచరిత్రము లేఁజదువు కొన్నదాన.

అహ:—అబలా! అంతటి ప్రమాదములకుఁ బాల్పడనేల? ఆలోచించి నీమానసమును కుదుటనిల్పుకొని మీయుపాధ్యాయులతో మఱల యోచింపుము. నేనిపుడేగి మఱల నేతేరువాఁడ. సదుత్తర మిపుడిమ్ము. అని షాహా ఖాజీతో వెడలిపోయెను.

---

## ఐదవ ప్రకరణము

### ఫిరోజిషాహాగారి యనుకంపము.

సందేశసమాధానములు విషమములుగఁ దోఁచుటచే బహామనీ విజయనగరరాజులు రణరంగమునఁబోర నిశ్చయించి, కృష్ణాతీరమును జేరియుండిరి. స్రవంతికుత్తరతీరమున మొగలు వాహినిపుట్టపీడినచీమలబారువలె వరుసలుదీరి నిలిచియుండెను. దక్షిణపుటొడ్డున నతివిశాలమగు సమతలమందు విజయనగరపు

లాఘవ ప్రబలియుండెను. సేనకునైఋత్యదిశయందు క్రోసు దూరమున రాయలశిబిరమతి మనోహరమగు విన్నాణమును గూర్చుచుండెను. పార్శ్వయుగముల మంత్రిసేనానుల పటకుటీరములును వసంతసేన విలాసమందిరమును శిబిరరక్షకమున కనువుగా నుండెను. వలయాకారముగా దీర్చిన రక్షకభటులకుటీరశ్రేణులు నగరోపరిప్రాంతమందలి కోటవలె శత్రువుల కభేద్యమై యుండెను. వాటి పిఱుందన నావరించిన సేనాసమూహము పద్మవ్యూహమును జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను.

ముద్దగల్లు పౌరులాంధ్రరాజుల వశీకృతులై తమమాయ మర్మముల వెలిబుత్తురని కాఁబోలు పురిచుట్టును మొగలుసేనల కాపుంచి తత్సమీపమందొక శిబిరమున షాహాకాపుండెను. ఉండిననేమి? అతనిమానసము స్వస్థతయందుండలేదు. కోవెలకు కలశము లెత్తినపగిదిచతుర్దిశలందును నత్యున్నతములగు బురుజులచేఁ దనరిన దుర్గరాజము ముద్దగల్లు. రామునిదండునుఁ దిలకింపఁగాంక్షితుఁడై యుత్తరగోపురము నలంకరించిన రావణునిపగిది రాయల రాణునఁజూడ కుతూహలుండై షాహా, చరమదిశయందలి ప్రహరిబురుజుపై కేతెంచెను.

అందునిల్చికనిన రాయలసేనాబాహుళ్యమంతయు దృష్టిగోచరమగు. ననుతలంపున ఖాజీ, వజీర్ మియజాన్ ఉల్లాలతో నారక్షకస్థానోపరిప్రదేశమందునిల్చి చూడసాగెను.

రాముల సేనాభివర్ణనము నభినందించు ప్రహస్తుఁడు వోలె రాయలకీర్తిసంపదయు, సేనాబాహుళ్యమును వజీరు విను

తించి యదివఱకే గూఢచారులచే తాఁ దెలిసిన శత్రువుల నివాస భవనములను వేలెత్తి చూపుచుండెను. తండోపతండములుగ నిల్చియున్న నారాణువను గన్న షాహామనము భీతికధీనమయ్యెను. మోమునందుత్సాహభావమొగిడిపోయి విషణ్ణభావ ముదయించెను. బాదుషాగారిని మోదభరితులనుజేయ నుపాయమెద్ది యని ఖాజీ యాలోచింప మొదలిడెను. రాయలవైభవమును వజీరుచే విన్నపిమ్మట తనకు విజయమబ్బుట యసాధ్యమని సుల్తానునకు బుద్ధి ప్రబోధింపఁజొచ్చెను. అపారమగు నాసేనను గన్నదాది యుద్ధమాపుటమేలని యాతనిమానసమెత్తి చెప్పుచుండెను. ఆర్జించిన గౌరవహాని కాకరమగుటయే గాక హిందూరాజులు చప్పటలుజఱచి నవ్వుదురను సంశయముతోచి లజ్జ నొందుచుండెను. ఏమి సేయఁగలఁడు? సేన నష్టమగునను జడుపు. విజయముచేఁ జిక్కదనెడి యనుమానము. శరణాగతుఁడైన పరిహాసభాజనుఁడనగుదునను నభిమానము. అన్ని సంకటము లొక్కసారియే పెనగొన ఖాజీవజీరులతో నిట్లు సంభాషించెను.

సాధూ! వజీర్! మీరెక్కార్యమున నన్నుత్సాహపూరితునిఁ గావించితిరో యక్కార్యమున విజయ మనుమానము సూచించెడి. వైరిరాజుల బలాబలంబులు గణింపక విజయకాంక్షితులగుట శార్దూలములతోఁ బెనఁగొనఁజూచెడి లేళ్లవలె తుదకు గేలికాకరులగుటయే! గూఢవృత్తినిఁ జరించిన మీకు శత్రువుల మాయమర్మములు తెలిసియుండునని తలంచి మీయాశయమును దీర్పఁబాలువడి యిట్టి యుత్కృష్టకార్యము

నకుఁ గడంగితి. ప్రత్యక్షపు పోరాటమున మన కపజయంబు నిక్కువంబ. కన్నులకు ఱెప్పలాదరువగునట్లు మదీయరాజ్యరమకు వీరలాధారభూతులు గాన కన్నువోకుండను, కాఁటుక చెడకుండను, తరుణమునకుఁ దగినయుపాయ మాలోచింపఁగోరుచున్నాఁడ.

ఖాజీవజీరులు ఱేనిమానసమును గుర్తించిరి. అపారమగు విజయనగరపుసేనా సంకులమునుగాంచి షాహా బెదరెనని వారికి దృఢపడియెను. తగినసమాధాన మొసగనిర్వురు నాలోచింప సాగిరి. వజీరుఁ డిట్లనెను:—

ఈవజీరువిజ్ఞాపనంబునఁ గొంతవఱకైన షాహాగారి మనస్తాపమంతరించుఁగాత. కేరళనరసింహరాయలు, ఓరుగంటి ప్రముఖులు, విజయనగరపు రాజులతో నేకీభవించుటచే సేన లపారముగఁ దోఁచి మానసమున కిట్టి నొప్పిఁ బెంచినది. సాహసమునగాని లక్ష్మి చేయంటదు. మోసమునగాని శత్రువు చేఁజిక్కఁడు. ప్రయత్నమునఁగాని కార్యము సఫలోన్ముఖమునకు రాఁజాలదు. ప్రకృతమున నాజికిఁదలపడినను లాభనష్టములు కొంతకాలమిరుతెగలకును సమానస్థితియందే పరిణమించుచుండును ఇంతలో బీరారు గోల్కొండదళములును, బీదరు బిజాపూరుసేనలును, మనలఁగలయఁగలవు. అప్పటికి మనరాణువ విజయనగరపు వాహినికన్న నొకటిన్నరసంఖ్య కధికముగానే చూపట్టఁగలదు. కాన ప్రారంభముననే కదనమునకు డీకొనుట కార్యంబు. ఆత్రపడి వైరికిఁ జోటిడితిమా ? సర్వానర్థదాయకంబగు.

ఖియాఉర్జాఫ్ ఉల్లా యీరీతిధైర్యమును బురికొల్పుచుండెను. అతనిసాధువాదములు పాదుషాగారి మానసమునకు సమాధానసూచకములు గాకుండెను. ఇట్లగుట షాహాసహజ భీరుకుఁడని మాచదువరులు దలంపరాదు. అతఁడు మహాయోధ. చాలనేర్పరి. అఘటన ఘటనాసమర్థుఁడు. మొగలుసేనలుదనుఁ జేరునంతటి వ్యవధిదొరకలేదు. కేరళనరసింహారాయలు తన కాప్తుఁడని నమ్మియుండెను. ఓరుగంటిరాజు సామంతుఁడని యెంచియుండెను. తరుణముభేదించి విపరీతావస్థలకు లోనుజేసెను. ఆంధ్రరాజు లేకీభవించిరని విన్నషాహా వజీరునకుఁ బ్రత్యుత్తరం బివ్వఁదోపమి ఖాజీవంకమోముఁద్రిప్పి నిశ్చేష్టితుఁడై చూడసాగెను. ఖాజీ పాదుషాతో నిట్లు మనవియొనర్చెను.

చిరపరిచితులయ్యును షాహాగారి సాధువునందలి విశేషము లరయజాలకున్నారు. బాల్యమాదినేనుపాసించిన మంత్రతంత్రంబులు, మాయమందులు, నాయందమోఘముగఁ బనిసేయుచుండును. అగ్నిస్తంభన, జలస్తంభన, వాయుస్తంభన, వాక్స్తంభనాదివిద్యలయందీపకీరుఁడు విశారదుఁడు. భయవిస్మయంబులకులోనై యతివ్యాకులతచిత్తులరగు నవాబుగారికి గిట్టినప్రపంచమే మునిఁగినట్లాతురపడెడి యీముసల్మానుఁ డిక్కట్టులడరిన యీతరుణమందరులపాలిమృత్యువై మొగలుమతమును నుద్ధరింప నిమ్మాశ్రయించి తనవిధిని నెరవేర్పకున్న నామమేల? కాల్పనా? ఉన్నది మీప్రాపున. తిన్నది మీ సొత్తున. కట్టినది మీవసనము. పుట్టినది మొగలాయిమతము

షాహాగారి యాపన్నతము లీడేరనినాఁడు ప్రాణములుండిననేమి? బొందిమండిననేమి? తుచ్ఛశరీరంబుపై నాసఁజెందువాఁడా యీఫకీరుఁడు? ఖాజీబొందినిఁ బ్రాణములున్న బాదుషా తలపై పువ్వాడకుండుఁగాక. నవాబుగారి నిత్యసంతోషమునకుఁ జిరానందదాయకమగుఁగాక. సెలవొసంగినచో నీబీదఫకీరొనరించు ఘనకార్యముల దివసత్రయంబున సుల్తానుగారు చూచెదరుగాఁత. తరుణమునదేని నపేక్షింపకున్నను వజీరునిమాత్రము వెంటఁగొని చన నను జ్ఞకీ ఖాజీయెదురు జూచుచున్నాఁడు.

ఈరీతిఖాజీ, షాహాగారికి ధైర్యమొసఁగెను. సుల్తానుగారి మానసమంతంతకుఁగలఁత తీరెను. ఫకీరువల్లనేదో యొకవిధముగాఁ దనకార్యము సఫలమగునని యతనికి విశ్వాసముదయించెను. మీాయర్ జాఫ్ ఉల్లానుగాంచి షాహా యిట్లనెను.

షాహా.—వజీర్? ఖాజీగారి వెంటనరుగ సమ్మతింతువా? సందేహింతువా?

వ.—సందియమేల? అగత్యముగఁబోయియే తీరవలెను.

షాహా.—అయిన దుర్గరక్షణమందును, సైన్యపోషణలందును దగునేర్పాటులొనరించి వెడలనగు.

వ.—మీాకాయాలోచనంబుపఁలేదు. హర్షప్రపూర్ణులై, ధైర్యమవలంబించియుండుఁడు. మాకాజ్ఞయిండు. అని సుల్తానుగారి సెలవంది, ఖాజీవజీరు లెందులకో వెడలిపోయిరి.

---

# ఆఱవ ప్రకరణము

## శారద — జానకి

శారద చింతాద్రిరెడ్డికి సనుంగుకూఁతురు. చింతాద్రి రెడ్డికి పుత్రసంతానములేమ ముద్దుల మూఁటగట్టుకుమారినిఁ గాంచి కాలమును వెళ్లబుచ్చుచుండెడివాఁడు. అతఁడు వెలమ నాఁటికాపు. అమేయధనధాన్యసమేతుఁడు. ఒకప్పుడైన నింటఁ భాడి తఱుగకుండును. శారద యవివాహితయని ముందే తెల్పి యుంటిమి. కారణమారయుట మనకిపుడు కర్తవ్యము.

కాలసూత్రము లోకమును తాఱుమాఱు గావించుచుండును. అదికొన్నివేళల సువృష్టిచే సస్యవృద్ధిఁ గావించును. మఱికొన్నివేళల వర్షాభావమై పంటలు పండకకఱవునకిరవై నీరసమును జూపుచుండును ప్రజలందమా? ధనవంతునకు మదమెక్కువ విద్యతక్కువ. విద్యావంతునకు వినయమెక్కువ ధనము తక్కువ. ప్రపంచమునందొకఁడు మూఢుఁడు. ఒకఁడు వివేకి. ఒకఁడు సన్మార్గుఁడు. ఒకఁడు జాత్యంధుఁడు. ఒకఁడు ధనికుఁడు. ఒకఁడు దరిద్రుఁడు. ఒకఁడు దాత. ఒకఁడు లోభి. ఏమిది? లోకవ్యవహారము సత్యాసత్యసమ్మేళనము! మంచిచెడ్డల కాకరము! సుఖదుఃఖములకిక్క! దీనిమాయమర్మములఁ గడతేరిన వారు ధన్యులు. వారధ్యాపకులు. వారుమాయాతీతులు. వారు ముముక్షువులు.

ఓరుగంటి రాజ్యములోనిది పానుగల్లు. పానుగంటి నగర వాస్తవ్యుఁడు సింహాద్రి. ఇతఁడు నిండుజవ్వనుఁడు. విద్యా

వంతుఁడు. విజ్ఞానవంతుఁడు. గుణవంతుఁడు. ఎన్ని సుగుణము లున్న నేమి? భాగ్యవిహీనుఁడు. నిర్ధనుని బంధువులుత్యజింతురు. మిత్రులు చేరనీయరు. ఇరుగుపొరుగువారు చెంతఁజేర్పరు. ఇఁక ధనవంతులు కంటఁజూతురా? చింతాద్రిరెడ్డి సింహాద్రిరెడ్డికి మేనమామ.

శారద నిండుజవ్వని. సింహాద్రి వయోవంతుఁడు. యువతీ యువకుల యన్యోన్యానురాగమపారమైనది. స్వల్పకాలముక్రింద టనే వారిమానసము లేకీభవించియుండెను. ఈడుఁజోడు సరి యని వారువివ్విళ్లూరుచుండిరి. ప్రేమానుబంధమెక్కుడగుడు కోర్కెలు మితిమీఱి కోటలఁదాటుచుండెను. కంకణబద్ధులగు టకుఁ గట్టుదిట్టము లొనర్చుకొనియుండిరి. కృతనిశ్చయములగు సప్రమాణములు లోలోన జరిగియుండెను. వీరి రహస్యాను రాగలత గుప్తముగా వృద్ధియగుట చింతాద్రియెఱుఁగడు. బీద కుటుంబమగుట చింతాద్రికి వియ్యము సరిపడలేదు. శారదను ధనవంతున కొసఁగవలయుననుటే యాతని యాశయము.

అతఁడిపు డూరలేఁడు. రాచూరునగరి కరిగియుండెను. అందేబదేండ్లేగిన వీరభద్రారెడ్డికి మొదటివివాహమాగిపోయి యుండెను, వీరభద్రారెడ్డి మితిలేని ధనవంతుఁడు. కడుంగడు గౌరవనీయుఁడు. మాటవాసినివన్నె మిగిలియుండెను. ఉండిన నేమి? వయసుచెల్లినవాఁడు. ఆతనికి శారదనుగూర్చిన, నన్న వస్త్రాదులకుఁ దక్కువలేకుండుననియు, ధనలక్ష్మిచే నయ్యాల లూగఁగలదనియు నెంచి యేరికినిఁదెల్పక నిశ్చితార్థము నిశ్చ యింపనేగియుండెను. వీరభద్రారెడ్డి యూరలేక పొరుగుగ్రామ

మును జేరియుండెను. వచ్చినమాటాడిపోవచ్చునని యతని రాకడను నిరీక్షించుచు చింతాద్రి యందే యుండెను.

తండ్రియూరలేమిఁ దెలిసి శారద బడికిఁబోనొల్లడ మందిర మందే పనిపాటలు చూచుకొనుచుండెను. ఇంటి పనులెల్లను దీరినతోడనే యేదియోవిషాదము మదికిఁదోపనంతర్భవనాంగణ మున, శిలావేదికపై, మాలతీవల్లరికడఁగూర్చుండి చెక్కిటఁజైఁ జేర్చి యేమియో యోచించుకొనుచుండెను. ఏదికేని పనిపాటలుఁ దీర్చుకొని స్వస్థచిత్తత ననుసరింతుమన్న లేనిపోని మనస్తాపము లుదయించి మానసమును కలవరపెట్టుచుండుట సహజమేగదా?

శారదకు వారద్వయంబు క్రిందటిసంగతి జ్ఞప్తికిరానీరీతి చింతిలఁదొడఁగెను. అకటా! బహమనీయువరాజు నాపైఁ వలపుఁగొనుట నాదౌర్భాగ్యమేగదా? హిందూమహమ్మదీయ మతములు పరస్పరవిరుద్ధములు. ఈ సాంగత్యమెట్లు సంఘ టిల్లును? అధికారపదవీప్రతిష్ఠలందు వారు ఘనులేయగుదురు గాక! అయిననేమి? కులశీలంబులఁ దలంపవలదా? బలసత్వ సమేతులగు వారొకవేళ బలవంతముగాఁబట్టిన నాగతియేమి? అట్టి కఠినకాలము దాపరించుతరుణమొదవిన తలఁదాచుకొన తావెయ్యది? సమాధానమగు ప్రత్యుత్తరం బిమ్మనిపీడించిరి. మణుల నేతెంతుమని సూచించిరి. బలవంతముగ బంధింతుమని భయపెట్టిరి. కఠినదండన విధింతుమని కండ్లెఱ్ఱఁజేసిరి. ఒజ్జసమ్మతి ననుసరింపుమని తొందరపెట్టిరి. ఇంకనునేమియో గుసగుస లాడిరి. కట్టా! అట్టి కఠినహృదయులు నన్నూరకవిడుతురా?

ఎట్టి సాహసములొనరింతురో? ఏపన్నుగడవన్నుదురో? తుద కేమిచేతురో? ఎద్దియుఁ దోపకున్నది.

ఒకవేళ గురువర్యుఁడు పదవీప్రతిష్ఠలకాసించి, పట్ట మహిషినగుదునను సంతసమున అంగీకారభావమును సూచించి యుండిన నాగతియేమి? అయ్యయో! తప్పాడితి. తప్పాడితి. అంతటి పాపకార్యమున కతఁడేలయొడిఁగట్టును? అట్లేల చెప్పును? గురునిఁదూరిన పాపము శాంతించుఁగాత.

ఏమో! అధికారమునకు వెఱచి యొకవేళఁ జెప్పియుండిన? చెప్పిన నే నొప్పుదాననా? గురువుచెప్పినను జెప్పుఁగాక. సుల్తాను ననుబలాత్కరించి బంధించినను బంధించుఁగాక. ప్రాణములు తుద ముట్టిపోయినను బోవుఁగాక. నేనొడఁబడుదునా?

సింహాద్రిరెడ్డి నాయూఱవప్రాణము. సామీప్యబాంధ వ్యము. అనుకూలదాంపత్యము. అనురాగమత్యధికము. సమాన మగు నీడుజోడు. అట్టి ప్రియంవదునివీడి యన్యుని వరింతునా?

శారదమానసమిట్లు కామ క్రోధ శోక పరిపూరితమై కళవళపడుచుండెను. అప్పుడే శారదా! శారదా! యని యొక గంభీరధ్వని వినవచ్చెను.

ఎవరు నన్నుఁ బిలిచినది?

రఘునాథశర్మ.

ఆర్యా యిదే వచ్చెద.

వలదు. నేనే యందులకరుదెతును.

రఘునాథశర్మ లోనికరుదెంచెను. శారద మోముఁగాంచెను. విచారభావమును సూచించు నామెవదనము వాడియుండుటనుఁగాంచి కారణమూఁరయు నిట్లనెను.

ఒంటరిగ నిందేమిచేసెదు? శోకసహితవనివదనము సూచించెడి. మాత కసరెనా? తండ్రి తిట్టెనా? యువరాజునకు వెఱచితివా? ఎందులకీట్లున్నదానవు?

యువరాజుగారట్లు గద్దించియేఁగిన వారద్వయమునుండి దారుణంబగు విపదంబుధిని మునుఁగుదుననెడి యనుమానము నానాట నభివృద్ధినొంది మానసము శాంతిఁగనకున్నది.

అయిన నీచింతఁబాయ నాయువరాజును బెండ్లియాడెదవా యేమి?

శివశివా! అట్లెన్నటికేనిఁ జరుగునా? సాహోగారికి నేవిన్నవించిన కడపటి ప్రత్యుత్తరంబు మీరాలకింపరైతిరి కాఁబోలు?

ఆలకింపకేమిగాని స్త్రీలు చంచలస్వభావముగలవారు. ఇట్లే బలవంతులు, భాగ్యవంతులు, ఘనులనిమానసము చలించిన మోస మొదవుఁననియే మఱియొకమారు మందలించుచున్నాఁడ.

ఆర్యా తుచ్ఛసుఖములకాసించు నీచవంశ సంజాతనని యెంచితిరా? మనసుననొల్లని పురుషునిఁజేపట్టుటకంటె నురిపెట్టుకొని చచ్చుటమేలుగాదె,

అమ్మాయి! ఇట్లంటినని నాపై గినియకు. ఒకవేళనీకట్లిష్ట మున్నచో మనయాంధ్రరాజులకే నినుఁగూర్పఁదగుప్రయత్నంబు లేనాచరించెద. చింతఁదక్కియుండుము.

గురూత్తమా! రాజులపాలఁబడి యంతిపురికాపరినై నిరంతరము చెఱసాలదుఃఖినివోలె ననుభవించెడి సుఖముకన్నను, దనపరువునకీడగు సామాన్యమానవుని వరించి యన్యోన్యానురాగమునఁ గుటుంబ సౌఖ్యమనుభవించుట సర్వోత్తమమని యెంచియున్నదాన.

అది నీయిష్టము. షాహాగారు నీసమ్మతినిఁదెలియ ననునియమించియేగిరి. ఇటీవల బహమనీసుల్తానులకును, విజయనగర రాజులకును మనస్పర్థలుప్రబలి ఇరువాగులుకదనమునఁ బోర నిశ్చయించి, కృష్ణయొడ్డునఁజేరినారు. ప్రకృతమున యువ రాజచటికిరాకున్నను ఖాజీమాత్రము తప్పకరుదెంచును. నను గాంచి మఱల నీవిషయమును మందలించినచో, నీ యీకడపటి ప్రత్యుత్తరంబే వానికి విన్నవించెద. నీవుమాత్రము భీతిలకుండుము.

రఘునాథశర్మ వెడలిపోయెను. శారదమానసమొక్కింత యూరటఁగనుచుండెను. అంతంతకుధైర్యమావహిల్లెను. మానసము పొనుగల్లునకొకగంతునిడెను. సింహాద్రిప్రతిబింబమామె యెదుట ప్రత్యక్షమయ్యెను.

ఆహా! విశాలవక్షమని వినుతించుచున్నది. ఆకర్ణాంత నేత్రములని యానందించుచున్నది. అజానుబాహువులని మురియుచున్నది. నవమన్మథాకారుఁడని భ్రమియుచున్నది. వెలలేని

సౌందర్యమని యుబ్బురపడుచున్నది. అనురాగమును దలఁచి హర్షించుచున్నది. అమితవిద్యావిశారదుఁడనికీర్తించుచున్నది.

శారదయెక్కడ? శారదయెక్కడ! యని బాహ్యభూమి నుండి యొక యాఁడుకూయి వినఁబడెను. తత్క్షణమున మానసము ముద్దగల్లుశిలావేదికపై మాలతీలతను సమీపించెను. పాపము శారదవదనమందలి వికాసముచివుక్కునఁ దరిగిపోయెను. అంతర్యస్థితియెట్లున్నను ప్రశ్నకు ప్రత్యుత్తరం బొసఁగవలయుఁగదా? అని యనుకొనుచు శారదయిట్లనెను.

ఎవరు ననుఁజీరినది? లోనికిరండు. ఏనిందున్నదాన.

శారదనుబిల్చినదిజానకి. శారదజానికికనుంగునెచ్చెలి. మఱియుమఱదలు. సహాధ్యాయిని. విద్యామతల్లి వినోదవల్లి మనోహరాంగి. జానకిలోని కరుగుదెంచెను. వదినెనుఁగాంచెను. గాఢాలింగనమొసరించెను. ఇర్వురును గొంతవఱకానందాబ్ధి నోలలాడిరి. మౌనమూనిరి. కారణముతోచదు. శారదముందుఁ బలుకరించవలెనని జానకియు, జానకిముందుఁ బలుకరించవలయునని శారదయు మౌనమూనిరి. ఎంతవఱకట్లుండఁగలరు? కాలాతీతమగుననియెంచి జానకియిట్లనెను.

శారదా? ఏనరుదెంచిజాగయ్యె. నీవు విశేషమేమనినన్నడుగకుంటివి. అడుగనిది చెప్పుటకు నాకనిష్టము. బిడువులప్పిచరించిన నాకింటిపనులు జరుగవు. నేఁబోయెద.

జానకి పానుగల్లునకు బంధువులఁజూడఁబోయియుండెను. సింహాద్రికి జానకి పెత్తండ్రికూఁతురు. జానకిమాతకు ముద్దగల్లు

జన్మసదనము. తండ్రిగతించుటచే నామెతనతల్లితోఁబాటు మేన మామగారియింటియందే యుండెను. అప్పుడప్పుడు కనిష్ఠపితృవ్యుఁడు జానకినిఁ బానుగల్లునకుఁ దోడ్కొనిపోవుచుండుటయుఁ గలదు. జానకి యభేదస్వాంతయై సింహాద్రియిల్లు స్వగృహముగానెంచి చరించుచుండును. పానుగల్లునుండి నాఁడేయరుదెంచినదిగాన నాదలి విశేషములు తెల్పుటకును, శారదనుసంతోషింపఁజేయుటకును, సరసోక్తులకాలయాపనం బొనర్చుటకును, శారదను సంబోధింపమొదలిడెను. విషయమంతయును గరతలామలకముగా శారద యెఱింగియేయుండెను. కాన నామె యిట్లు ప్రత్యుత్తరం బియ్యసాగెను.

జానకీ! గుఱ్ఱముపై తడివేసినావేమి?

వదినెగారు నన్నడుగవలసినసంగతి నడుగనందులకు.

జానకీ! రమ్మంటిని. కూర్చుండుమంటిని. క్షేమమడిగితిని. ఆలింగనంబిచ్చితిని. ఇంకేమడుగవలయునో నాకుఁదోచదు.

ఇవియన్నియును విషయరహితమగు నుపచారవాక్యములు.

ఒకవేళనడుగుటకేనుమఱచినను దానినుగ్గడించి నీవువెలిబెట్టిన నోటముత్యములు రాలునా?

పిలువనిపేరంటమును జెప్పనియొక్కప్రొద్దును నెందేనిఁ గలదా? నీవు మర్మముగలదానవని నేనిపుడు నిజముగా నిశ్చయించితిని.

సరే. అట్లేయనుకొనుము,

శారదా నీవుచాలగట్టిదానవు. నా వ్రేలిచేతనే నాకంటినిం బొడిపింపం జూచుచున్నావు. నేనో నీకన్నను గట్టిదానను.

జానకీ! ఊరక ననుపరిహాసమాడకు. ఏదేనిం జెప్పందలంచితివేనిం జెప్పుమని శారద కినుకస్వభావముతోం బలికెను.

వదినా! కోపమెందులకుగాని నాయన్నయగు సింహాద్రినింగూర్చి యేమైనను బ్రస్తావించితివా?

జానకినోటిగుండ వెడలిన యీమాటవిన్న శారద వికసిత వదనయయ్యెను! అధరపల్లవమునం జిరునవ్వు తళుకాడనారంభించెను. మేనంతయుం బులకలావిర్భవించెను. అనురాగరసముప్పొంగెను. ఆనందాశ్రువులుకనులంగారెను. లజ్జాతిరేకమునవనథోవదన యయ్యెను. గోర నేలంగోంకుచు మెల్లన నిట్లనెను.

జానకీ మఱచితి క్షమింపుము విషయమేమో ముగింపుము.

మాటమాత్రమునకే లజ్జావనతవదనవైతివి. మఱిముందున్నదే మునర్లపండుగ?

అదిగో మరలపరిహాసమునకుం బ్రారంభించితివి, చెప్పందలంచుకొన్నది సత్వరము ముగింపుము.

ఇపుడున్నయాతురత ముందెచటికేఁగియుండెఁ? ఇదిగో లేఖ.

ఎవరంపిరి?

నాయన్న సింహాద్రి.

శారదమోమున నుల్లాసము వెల్లివిరిసెను. కమ్మఁగైకొనెను. ముందు వెనుక మఱలమఱలఁ దిలకించెను. కన్నులకద్దుకొనెను. లేఖనునిదానించి చదువుకొనెను. కాని మోమునందు విపరీతభావములు తోఁచుచుండెను. ఆశ్చర్యమభినయించుచు జానకితో నిట్లనెను.

కమ్మయందలివిషయములు నీవుచదివితివా?

అగ్రజునిచేవ్రాలును ముద్రికాంగుళీయకపుగుర్తును, భద్రచిహ్నములై యుండ విషయము నెట్లు చదువుకొనఁగలను?

యువరాజుగారియాగమనవార్త, ఖాజీ, షాహో, యొజ్జలతో జరిగిన వాదప్రతివాదములందలి పర్యవసానమతిని కెల్లెఱుకయయ్యె. నీ వెఱింగించితి వేమో?

నేనెఱింగింపవలయునా? లోకులనోళులకు మూఁకుడు మూయ నాతరమా? వెడలిపొమ్మన్నను వాతాయనపుసందుల గుండఁజూచుచున్న ప్రేక్షకులు మీయనుభాషణమాలించి తప్పెటలఁజాటియున్నారు. ఇందతిశయమేమి?

నన్నుఁజుల్కఁజూచి తూలనాడిరా?

లేదు. లేదు. లోకులతిశయోక్తు లెన్నియోకల్పించి చెప్పియుండిరి. మాయన్న నన్నెచ్చరించెను. నిజమును మాత్రము నిరూపించితిని. అతిశయోక్తులబద్ధమంటిని. కళవళమందిన యతనిమానసము సమాధానసరణికి త్రిప్పితిని.

లిఖితరూపమునఁ దెల్పిన యీయభిప్రాయము వేఱుగా నున్నదే. ఏపుట్ట నేపాముగలదో? ఎవరికెఱుక? ఆలోచింప నాకివి మంచిదినములు కావు. మాయిర్వురి యనురాగలతకు యువరాజుగారి యాగమనమాయుధమయ్యె. దైవమున్నాఁడు. అబలనగు నేనేమిసేయుదాన?

ఆయుత్తరమైన నిటు దెమ్ము. అదేయర్థమిచ్చునో? చూడ నైనఁ జూచెద.

అర్థమనర్థముగానున్నది. ఆత్మసఖివే గదా? చూడుము. అని కమ్మను జానకికొసఁగెను. జానకి లేఖ నీరీతిఁజదివెను.

శారదా, వారి వాహమంబరతల మాచ్ఛాదించెను. మయూ
గము సంతసించి పింఛమునువిప్పి నాట్యమాడు
చుండెను. సంతసముఁజూచి సహింపలేని ప్రచండ
మారుతము వడివడిగా వీవసాగెను. మేఘ
మెగిరిపోయెను. నాట్యమాగిపోయెను. భవిష్య
ద్విషయపరంపరాభివృద్ధికంత రాయములంకురిం
చెను. విధిబలవంతము. కర్మ భోక్తవ్యము.

ఇట్లు, సింహాద్రి
చిరపరిచితుఁడు.

జానకి మఱల మఱల లేఖను పఠియించెను. శారదా మోమును బరికించెను. ఆమె మోమునం దపరిమితపరితాపము వెలిఁబుచ్చుచుండెను. ఏమియుఁదోఁపమి శారదతో నిట్లనెను.

వదినే! అర్థము గూఢముగానున్నది. విషయము విచార ణీయము.

ఇఁక విచారమేమున్నది? తన ప్రేమాతిరేకమపారమై వెల్లివిరియ నేనానందించుచుంటిననియు, నడుమ యువరాజు గారి యాగమనమున చిరకాలానుమోదము విచ్ఛిన్నమయ్యె ననియు, దానభవిష్యద్విషయపరంపరాభివృద్ధికంతరాయమొదవె ననియు నర్థము స్పష్టమయినది.

అనురాగమపారము. కాలమనివార్యము. చేయునదేమి? ప్రత్యుత్తరం బొసంగెదవా?

పానుగల్లునకుఁబోవు పరమాప్తులెవరు?

ఎల్లుండియే మఱల నా ప్రయాణము.

ఇఁక నాకు భయములేదు. నేఁడంతయు నాయాలోచ నంబున కవధి కలదు. రమ్ము పోవుదము. అని వారాస్థానమును వీడిరి.

---

## ఏఁడవ ప్రకరణము

### ఆకస్మికాపాయము

అమాత్యవరా! అనర్థమాపాదిల్లెరా! రమ్మని విభాన సుఁడు గుండయమంత్రిపటకుటీరముచెంతకుఁ బరుగిడివచ్చెను. వసంతసేనవృత్యకౌశలముఁ దిలకింపఁబోవనున్న యానచివస

త్తముఁ డీవార్తనువిని బయటకరుదెంచెను. విభావసుఁడు నెత్తి గొట్టుకొనుచుఁ బ్రబలముగా రోదింపనారంభించెను. వేడుక చెలికాఁడగుట నేదో యుపహాస్యమునకై యేడ్చుచున్నాఁడని తలఁచి విభావసూ! రాయలచెంత ననుఁగూర్చ వేఱుకారణము లేదయ్యెనా? నాయాగమనమునకు నీరోదనమే శుభసూచకమా? వసంతసేనానృత్యము హర్షదాయకముగా నున్నదా? రాయలు ననురమ్మని త్వరపెట్టుచున్నారా? అందులకే యేనును ప్రయాణమగుచుంటిని. పైవల్లెఁ జేకొని యరుదెంతు. నీగోడుజాలింపుమని మంత్రి మందలించెను.

"వసంతసేన నృత్యముమండిపోను, నీపైవల్లెకాలిపోను, ఖడ్గపాణియై శత్రువు పైఁబడి యందఱినిఁ జక్కాడుచున్నాఁడు. రక్షకభటులు తమతమ పనులయం దప్రమత్తులై యుండిరి. హఠాత్తుగా సంభవించిన యల్లరినాప నాయుధంబులు వీడి స్వేచ్ఛావినోదులై వసంతసేనానృత్యమందు లీనులై యుంటిమి. విలాసభవనము కడకు దీనాలాపమందిరమయ్యె. రక్తము కవాటద్వారములనతిక్రమించి వెల్లువయై పాఱుచున్నది. సందడి యతిశయింపఁ బ్రజలు మూఁకలు మూఁకలుగా ముసరియున్నారు. వైరులెవరో ఆప్తులెవరో హర్తలెవరో హంతకులెవరో కనుట కడుఁగష్టము. దిక్కుఁ దోఁపమి నినుఁ జేరనరుదెంచి యుండలయుచున్నాఁడ. సత్వరము నీవొక కత్తిఁగొమ్ము. నాకొకయసినిమ్ము. వేగిరము రమ్ము. అని యేడ్చుచునే జరిగినయుదంతమును విన్నవించెను. విభావసుని రోదనాలాపముల నేదో ప్రమాదంబువ్విల్లినదని గ్రహించి వెంటనే యొక కృపాణమును

బూని యొకరిజంటనొకరు వసంతసేన విలాసభవనము చెంత కరుదెంచిరి. అందు కొందఱు రక్షకభటులు గుంపులుగాఁ జేరి యుండిరిగాని వసంతసేన యెందరిగెనో యెవరికినిఁ దెలియలేదు. మంత్రి యరుదెంచుటనుగాంచి యారక్షకభటులు సమ్మృలై త్రోవవీడిరి. ఏఁగిచూచుసరికి ఖండతుండములుగాఁ బడియున్న యొక మానవవిగ్రహముపై రాయలు నిశ్చేష్టితుఁడై పడి యుండెను. గుండెలవియజడుపునకులోనై నాయిర్వురు రాయల నాడి బరీక్షించిరి. అది ధారాళముగా నాడుచుఁ గ్రమస్థితియం దుండెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములఁ బరిశోధింప వాక్థ్యానమం దును నాసికాపుటములచెంతను జేతులనిడిరి. సమానోష్ణతఁగలిగి గాలి ధారాళముగాఁ బ్రసరించుచుండెను. కరపల్లవములను జరణ కమలములను బట్టిచూచిరి. అవి శైత్యరాశియందుండక యుష్ణా ధిక్యముఁ గాంచుచుండెను. రాయల కేయపాయమును బొడమి యుండలేదని వారెఱింగిరి. మూర్ఛావస్థయందు మగ్నులై యున్నారని తెలిసికొని విశ్రాంతిసుఖమునకై — మూఁగిన భటాళిని బయటకనిపి నిర్మలవాయువులు బ్రసరించుటకు తగు వసతిఁగల్పించిరి. శవముపైఁబడి యున్నరాయలను వేఱుస్థలముఁ జేర్చి సేదదేరువఱకు వారి శుశ్రూషయందు విభావసునినిల్పి సచివుఁడు బయటకరుదెంచెను. అందు కొందఱు సైనికులు గుసగుసలు వోవుచుండిరి. సర్వరక్షక రక్షితంబగు శిబిరంబునం దొడవిన యాపదఁగనలేని మీజన్మములేల కాల్పనా? యని మంత్రివారలఁ గద్దించెను. మాపనులయందు మేమతిజాగరూకు లము. వైరి యరుదెంచినదిగాని, విపర్యాసమొదవినదిగాని,

నాట్యమాగినదిగాని, మేమెఱుఁగము. అని యతిదీనముగా వారు విన్నవించుకొనిరి. మంత్రి యామూఁకనువీడి కొంతదవ్వరిగెను. అందుకొందఱు యోధులు తమతమ వాజుల నడిపించుచుండిరి. కొందఱు విచ్చుకత్తులుచేఁబూని గస్తుతిరుగుచుండిరి. సచివుఁడు శిబిరమందొదవిన యర్థమునకుఁ గారణమారయరా? యని వారలఁ బ్రశ్నించెను. అందులకువారు మేమెఱుఁగము గాని యిర్వురుమాత్రము ముందునకేగుచు విటకత్తెమందిరముపై వైరులు పడియుంటచేనిఁ జెండాడుచున్నారని రోజుచునరుదెంచిరి. మీరెందులకేగెదరని మేము ప్రశ్నించితిమి. వార్తదెలుప ముందునకేగెదము. విలాసభవనముచెంతకు మీరుపొండని నుడివి పరుగులిడుచుఁబోయిరి. ఇంతతప్ప మఱేమియు మేమెఱుగమని నుడివిరి. వారెవ్వరైనదియు మీరుగుర్తించలేదా? యనిమఱల మంత్రి మందలించెను.

శిబిరరక్షకులవలె నుండిరని భటులు ప్రత్యుత్తరం బొసంగిరి. విషయసంకటమునకు విముక్తిదోఁపమి సచివుఁడు మఱల ముందునకేగెను. అది సేనాముఖముగా నుండెను. అందు కావలివారు కాపుండిరి. జరిగిన యనర్థమునుగూర్చి మంత్రి వారలఁ బ్రశ్నించెను. దివసత్రయంబుక్రింద నిర్వ్వీర్యఫ్ర్యాహాముఖంబున కరుదెంచిరి. అందు ప్రథముఁడు వయసుముదిరినవాఁడు. కాషాయాంబరమును గప్పియుండెను. ద్వితీయుఁడు నడితరమయిన ప్రాయఁపువాఁడు. ధవళోత్తరీయమును ధరించియుండెను. మీరెవ్వరని మేము ప్రశ్నించితిమి. సన్యాసి మనరాయలయుంపుడుగత్తెకుఁ గురువనియె. రెండవవాఁడు సన్యాసికిఁ శిష్యుఁడనియె.

వసంతమ్మభిక్షుఁగొనఁ బ్రార్థించినదనియు, ఆమె మందిరమునకు మార్గముఁ జూపుఁడనియు మముఁగోరిరి. ఒకసేవకుఁడేఁగి కుటీరమును జూపించెను. అందేమిజరిగెనో మాకుఁ దెలియదు.

గడియక్రింద నిర్వురురక్షకభటులేతెంచి "శిబిరముపై వైరులుపడినారు. మేమేగి యీయవసరహాస్యముల నారసివచ్చెదము. మీరిందు జాగ్రత్తగాఁగాపుండు"డని తెల్పిశాత్రవవాహినినిఁ జేరఁబోయిరి. ఇంతియే మాకుఁదెలిసిన వృత్తాంతమని కావలివారు నుడివిరి.

మంత్రిమానసమందిపుడు నానావిధములగు శంకలుదయించెను. అతఁ డీయనర్థప్రతీకారమునకుఁ బ్రతిసేయఁ నాతురుఁడై యుండెను. వసంతసేన శిబిరమునకేతెంచిన విరాగి యెవఁడగునను ననుమానమతని వేధింపసాగెను. శత్రువర్గంబునఁజేరి యిట్టి కృత్రిమవ్యూహంబువన్ని రాయలామెకే ద్రోహమొనరించి" రని వితర్కింపఁదొడఁగెను. వైరులే రక్షకభటవేషములూని కావలివారికంటదుమ్ముఁగొట్టియుందురని యనుమానించెను. కపటవ్యూహంబునఁ గావలివారుకూడను జేరియుండిరేమో యనుసందియము దోఁచెను.

అన్నియు సందియములే! జరిగినదంతయు నక్రమమె! నిజమెట్లు కనుఁగొనఁగలఁడు? పర్యవసానమెట్లు తేల్చఁగలఁడు? రాయలుమూర్ఛయం దున్నారనుచింత. శత్రువులు సాగిపోయిరను నాతురత. ఘోరకృత్యము జరిగినదను నావేశము. ఇన్ని సంకటములొక్కమాఁటే యావరించిన మానవమాత్రుఁడేమి చేయగలడు?

కావలివానినిఁ జెఱయందుంపించెను. వసంతసేనను వెత కించెను. ఆమె జాడ తెలియలేదు. రాయలచెంత కరుదెంచెను. ఇంకను రాయలకు మూర్ఛవీడియుండలేదు. విషయవైపరీత్య మెంతవఱకు దాఁగఁగలదు ? జనపరంపరగా వార్త యంతిపురమున కెఱుకయయ్యెను. రాయలపట్టమహిషి గౌరాంబిక ఈ విషమ వార్త విన్నవెంటనే తలమోదుకొనుచు నెదఁబాదుకొనుచు శోకావేగము భరింపలేమి సామాన్యస్త్రీవలె విలాసభవనమును సమీపించెను. అంతఃపురస్త్రీలందఱు నామెతో నరుదెంచిరి. వసంతసేనయు వారివెంబడనే యుండెను. అందఱా భవనమును జుట్టుకొని హాహాకారములఁ జేయమొదలిడిరి. అయ్యో ! కుమారా ! యని పట్టుదప్పిన జంత్రపుబొమ్మమాట్కి దేవిశివ ముపైఁబడి మూర్ఛిల్లెను. అంతఃపురస్త్రీవిలాపములు మిన్నంటెను. ఏమి యాగందరగోళము ? ఏమి యారోదనధ్వని ? వారింపరానిది. భరింపఁగూడనిది. ధరింపశక్యముగానిది. తరింప మార్గములేనిది.

మంత్రి కేవిధమగు యోచనయుఁ దోఁచకుండెను. ఆ శోకము వారింప నతనికి శక్తిలేకుండెను. రాయలస్థితిగతులార యుట యావశ్యకమని బుద్ధి ప్రబోధించుచుండెను. వసంతసేన యంతర్భవనమందు రాయలకు శుశ్రూషజరుగునని యాతడెఱింగి యుండెను. రాయలనుజూడ విలాసభవనమునకుఁ బోయెను.

అందపుడపుడే రాయలకు మూర్ఛదేరుచుండెను. వారు మంత్రివదనము నెగాదిగఁ దిలకించిరి. దుస్సహశోకానలదగ్ధులగు హరిహరుల నేత్రయుగ్మములనుండి సంతాపాశ్రువులురులుచు

నుండెను. అపారముగు పరితాపమతిశయింప హా! మంత్రీయని సంబోధించిరి. మౌనధారియై మంత్రి, తన యంగవస్త్రమున మోముగప్పికొని దుఃఖింపసాగెను. రాయలు కరవస్త్రంబుచే మోమునాచ్ఛాదించి పైన నొక్కమాటయేనిఁ జెల్పనోరాడమి చిత్రప్రతిమవోలె నిర్విణ్ణుఁడయ్యెను.

కటా! చిరానురాగసంయుతంబగు పుత్రవ్యామోహంబుఁ ద్రోయ నెవరికిసాధ్యము? అపారశోక పారావారమగ్నులై కొడుకు, కత్తి, వైరి, వసంతసేన యనునున్మత్తాలాపములఁ బ్రలాపించుచు ప్రచండవాతాహతింద్రెళ్లు భూరుహంబువాడిక్క-రాయలు ధరణిపైఁ బడిపోయిరి.

మంత్రివిభావసుల శుశ్రూషలచేతను, మృదుతరంబులగు వినయోక్తులచేతను, నాదరపూర్వకంబులగు నోదార్పులచేతను, స్వచ్ఛమయిన గాలివీచుటచేతను, ఆవరించిన యున్మత్తతవీడ, వైరిచేఁజిక్కెనా? వసంతసేనను బట్టుకొంటిరా? నే నిపుడెందున్నాఁడ? విలాసభవన మిదగాదే? నన్నెవరిచటికిఁ దెచ్చిరి? కుమారుఁడేడీ? అచ్చటికి ననుఁగొనిపొండు. అనిరాయలు పలవరించిరి.

ఇవి రాయల యున్మత్తవాక్యములు కావు. వారిపుడు తెలివితేటలతో నుండిరి. ఆపరాని దుఃఖపూరితాలాపములని గ్రహించి మంత్రి యిట్లనెను.

దేవా! మీరు విజ్ఞానవిశిష్టులరు. అల్పజ్ఞులగు మాబోటి సచివులకు ధైర్యమొసఁగువారు. విషయవిపర్యాస మతీతమైనది. గతించిన విషయములందడలుచుట గతజలసేతుబంధ

నము. శరీరము లశాశ్వతములు. జీవములు క్షణభంగురములు. సుఖదుఃఖములు కావడికుండలవంటివి. దారాపుత్రాదులు సంత వ్యాపారులవంటివారు. ఇట్టి మాయాప్రపంచమునఁ గష్టసుఖ ముల సమముగ నెన్నువారే ధన్యులు. వారుమాన్యులు. ఈ దీనుని విజ్ఞాపనంబాలించి సంతాపంబపనయించి కర్తవ్యమాలో చింప వేఁడువాఁడ.

సచివా! లోకవృత్తమెఱుఁగని జడుఁడనుగాను. నిరంత రము నెత్తురుకూటిచేఁ జీవించువారు భూపతులు. ఎల్లపుడు వారిగళముపైఁ గత్తి తళతళమెఱయుచుండును. కుమారునిఁ జంపినది మోసవృత్తి. మనకాప్తులే యరులకుఁజోటిడిరి. వైరులు మనమాయ మర్మములెఱింగిరి. కుమారుఁడు శత్రుశ్రేణిచే హాహాకారిగఁబోరి గతించియుండిన నీవంతయే నాకుండదు. కులముద్ధరించు కుమారుఁడు. యువరాజు పదమునలంకరింపఁ దగినసుతుఁడు! రణవిద్యావిశారదుఁడైన తనయుఁడు! గంభీర స్వభావమును జాటుసూనుఁడు! అమితతేజశ్శాలియగుపట్టి! ఎల్లవిద్యలకీల్లైనకొడుకు! బాల్యసంసారము! సద్గుణఖనియైన భార్య! ఏమిచూచె? ఏమిచేసె? తుచ్ఛకుకృత్రిమవ్యధకుఁబాల్ప డియె. అకాలమృత్యువునోటఁబడియె.

జరిగినవిధానమెట్లాలోచించినను తేటపడదయ్యె. ప్రత్యక్ష మునఁదాముండియు నిట్టియకార్యమెట్లుజరిగెనో తామానతియ్య నర్థించుచున్నాఁడ.

వసంతసేన వ్యాపారమతిభయంకరమైనది. కృత్రిమగా యక వేషధారులగు నపరాధులు కృపాణసాధనమందతిచతురులు.

మండలాగ్రములుచేఁగొని విచిత్రవినోదవిహారములు సల్పుచుండిరి. కటిప్రదేశములు, ఊరుస్కంధములు, బాహువల్లియు బాద్యంగాంగములంతరించు వారివలె నయ్యైస్థానముల కతిలాఘవముగఁ గత్తులఁజొన్పుచుండిరి. నిజముగాఁ బోరువారివలెఁ జూపఱులకన్నులకు మిఱుమిట్లుగల్పించుచు నపుడపుడు మమ్ము సమీపించుచుండిరి. తమతమ యుక్తిసామర్థ్యములఁ జూపుచున్నారను విశ్వాసముదయించుటచే వేడుకఁజూచుచుంటిమి. కత్తుల చకచకనాడించుచు నొకరికొకరు ప్రగల్భకార్యములువలుకుచుఁ దమ్ముఁదామే శ్లాఘించుకొనుచు హఠాత్తుగా కుమారుని కంఠమునకుఁ గృపాణమును విసరిరి. కఱుక్కునకంఠంబుదెగి సూనుఁడు గద్దియనుండి దిగ్గున నేలఁగూలె. "హా! హా! యను ప్రేక్షకులయార్తనాదములు, పట్టుఁడు, కట్టుఁడు, కొట్టుఁడు" అను వీరాలాపంబులంతటనిండ నాహంతకులు మూఁకవీడిమెటుచనిరో యగోచరులైరి. అపారముగాఁ బాఱురుధిరమునుగాంచినతోడనే యనిర్వచనీయమగు వికారముదయించి క్రిందఁబడిపోయితి.

కుమారునిచెంత కొకమారు ననుగొనిపొండు. కడపటి వీక్షణమునఁ బుత్రఋణమునుండి విముక్తుఁడనయ్యెద.

రాయల నచటినుండి కొనిపోవుట మంత్రికనిష్టముగాఁ నుండెను. కాని యేమిచేయగలఁడు? ఆజ్ఞగడవరానిది. అట్లే. విభావసుని సహాయకారిగాఁగొని యిర్వురిరు కరంబులఁబట్టుకొని కుమారుచెంతకుఁగొంపోయి కూర్చుండఁబెట్టిరి.

అకటకటా! అందు గౌరాంబిక మూర్ఛవీడినది. శవముపైఁ బడిప్రలాపించుచున్నది. పట్టీ! భూఋణముదీరెనా? ఈజన్మమున నినుజూచు పుణ్యమింతియేనా? తండ్రీ! రణశూరుఁడవగు నినుఁబాసి యీజీవము నెట్లువేగింతు? కుమారా మందభాగ్యనగు నాకు నీవంటిగుణరత్నంబుదక్కునా? తనయా! మందిరముఁజేరెనకోడలు పార్వతినీయునికినడిగిన నింకేమని తెల్పుదును? ఆమెదుఃఖమపారమే! ఎట్లువారింతును? అరులతోఁబోరి మడసెనందునా? కృత్రిమవ్యాఘకుఁ బాల్పడెనందునా? కన్నకడుపుకానపాలయ్యెనందునా? ఏమందును? ఎందుఁజొత్తును? తెరువెద్ది? అన్నా నన్నుఁబాసిబోయితే? అమ్మా! యనిబిల్చువారింకెవరు? ఈజన్మమునవాకింతియెగా? కుమారా! రణగంభీరా! జితశూరా! హతభాగ్య" నని దారుణంబగు శోకతాపమున శవముపైఁబడిపోయెను.

ఆహా! పుత్రశోకమగాధమయినది. వర్ణింపసాధ్యములేనిది. అయ్యో, గౌరాంబిక కేశకలాపమువీడి విచ్ఛిన్నమైయుండె. బారులుతీరినయావినీలకుంతలములు భూమినూడ్చుచుండె. కట్టాధరపైఁబడిబొర్లాడె. మఱలమఱల లేచె. కుమారు నాననము వీక్షించె. శోకవేగమునఁ నిరంతరధారగాస్రవించు దుఃఖాశ్రువులచే గుమారుమోముఁదడిపె. అంగాంగములు స్పృశించినాయనా! పోయితే యని యంగలార్చె. తలమోదుకొనియె. ఎదఁబాదుకొనియె. తెలివొందె. బతిమాలె. పలవించె.

స్రవంతికినుదీచీ దిశయందు ముద్దగల్లునాపుజేసికొని యొక శిబిరమున షాహోయుండెనుగదా? అతఁడిపుడువిజయోత్సవముఁ

జరుపుకొనుచుండెను. నౌబత్ నగారాధ్వనులు బోరుకొనుచుండెను. బీదసాదలకు దానమపారముగాఁ జేయఁబడియె. కుంటి కురూపులకువస్త్రదాన మొసఁగఁబడియె. ఫకీరులు, అధికారులు, ఖాజీవజీరులు, పాహాతో శిబిరమునఁ సభఁదీరిరి. ఫిరోజిపాహా పసిండిగద్దియనధివసించెను. ఖాజీవజీరు లున్నతాసనముల పై పాహాకిరుపార్శ్వములఁ గూరుచుండిరి. తక్కినసభ్యు లందఱుఁ బదవీప్రతిష్ఠల ననుసరించి వారివారిస్థానముల నలంకరించిరి. ఫకీరులందఱులేచి యల్లానుఁబ్రార్థించిరి. కొందఱుద్యోగియులేతెంచి సభాధ్యక్షులముప్పురినిఁ గుసుమమాలలచేనలంకరించిరి. పాహాగారినెల్ల వేళల నల్లారక్షించుఁగాత యని ఖాజీయాశీర్వదించెను. సుల్తానుగారి నెల్ల వేళల విజయలక్ష్మివరించి యుండుఁగాత యని వజీరుదీవించెను. ఖాజీవజీరులప్రయత్నంబులెల్ల వేళల నిష్ఫలమగుఁగాక యని సంతోషమునఁబల్కి పాహాసభ్యులతోఁ జెలనిట్లని యుపన్యసించెను.

యోధాగ్రేసరులారా! నేఁడీ విజయోత్సవ మెందులకై జరుపఁబడెనో మీయందఱిమోలవినిపింపఁ గుతూహలుఁడనై యున్నాను. అపారపారావారసమంబగువిజయనగరసేననుగాంచి నేనించుకజంకితి. అందుకుఁగారణముసామంతనృపులు తమరాణువులతో ననుఁజేరుట కాలస్యమగుటయు, నాకాప్తులని నమ్మిన యాంధ్రరాజులందఱు విజయనగరపురాజులతో నేకీభవించుట యునే! అట్టితరుణమున ఖాజీవజీరులు నాకుధైర్యమొసఁగి గుప్తవేషములవిజయనగరపురాణువఁజొచ్చి, భోగముదానిమేళమునఁ జేరి, యసివిద్యానైపుణ్యమును జూపువారివలెనటించి, రాయల

నేమరించి, రాకొమరుఁదమకృపాణమునకుఁబలియొసంగి విజయ మాపాదించిరి.

కంటిరా! ప్రభుభక్తియన్న నిట్లుండవలయు! వీరొనర్చిన యుపకృతికి—నీకెకి నాయందుఁగల సంపూర్ణవిశ్వాసమును వెల్ల డింపఁగోరి—స్వయముగా నే నీసుమదామముల నలంకరించు వాఁడ నని సుమమాలల వారి కంఠసీమలలంకరించెను. అందఱ త్యానందభరితులైరి. ద్రాక్షారసమందఱికొసఁగఁబడియె. అందఱు హుక్కాలఁబీల్చుచు నాధూమము నూర్ధ్వమునకు విడుచుచుండిరి. అంత నొకభటుఁ డరుదెంచి యిట్లనెను.

హుజూర్! రాయలు బంకాపురమునుబట్టికొన సేన లతోఁ గదలిపోవుచున్నాఁడు. ఈముట్టడినివీడి సేనలు చీమ గుంపుల చాడ్పున బారులు తీరిబోవుచున్నవి. ప్రహరిపై కేగినఁ గాంచనగునని పలికి మిన్నకుండెను.

సేనాబాహుళ్యము కదలుటనుజూడ నాతురుఁడై షాహా బురుజలపై కేఁగెను. ఖాజీవజీరులుజంటనే బయలుదేఱిరి. చూచు నప్పుడుసేనలు బంకాపురమార్గము ననుసరంచిపోవుచుండెను. నది గట్టున ధగధగాయమానముగాఁ బ్రజ్వరిల్లుచున్న యగ్నిజ్వాలలు మిన్నుఁటుచుండెను. ధూమము మన్నుమిన్ను నేకముగా నావరించి యుండెను. అదే! గొల్లపల్లెకు శత్రువులు నిప్పఁటించుచున్నారు గదా? యని షాహా, ఖాజీవజీరులఁ బ్రశ్నించెను. లేదు. మాచేఁ బ్రాణములఁ గోల్పోయిన హరిరాయలశవమును దహనము గావింప మండుచుండెడికాష్ఠమది యని ఖాజీవజీరులు ప్రత్యు త్తరం బిచ్చిరి.

రాయలు బంకాపురమునుబట్టికొనఁబోవుట కొమరునిఁ జంపిన యీర్ష్యయేకారణమని తెలిసి మొఘులుసేనలు బ్రహ్మపురమార్గముగానేగి బంకాపురమును సంధించిరిగాని వైరుల జాడయే యందులేమికి విసికివిసికి స్వస్థానమగుదౌలతాబాదును జేరఁబోయిరి.

బంకాపురమార్గమనుసరించిన రాయలసేన తప్పుదారి నడచి విజయనగరమును జేరుకొనియెను. గుండయమంత్రి ప్రదర్శించిన బంకాపురపుముట్టడిని గురించినవార్త రాయలను సునాయాసముగా విజయనగరమునకుఁజేర్చ మార్గదర్శకమయ్యెను. వసంతసేనను కారాగారమునందుంచునట్లు రాయలయనుమతి యయ్యెను. పాపము! వారాంగన కారాగారమునఁ బరితపించుచుండెను "దీనిముఖవైఖరి విపరీతముగానున్నది. యోచింపఁగా నీమాయలాడియే యాఘోరకృత్యమునకెడమిచ్చి యుండునని తోఁచుచున్నది" యని రాజును మంత్రియు శంకించుచుండిరి.

మఱునాఁడు రాయలవా రమాత్యసహితులై కారాగారమునందలి వసంతసేనను స్వయముగాఁ బరీక్షింప నరుగుదెంచిరి. విభావసుఁడుసహితము రాయలవారితోనే తెంచెను. వారిరాకం గని యామత్తకాశిని ససంభ్రమమున లేచినిలిచి జారిపోనున్న కొప్పుసవరింప నందుండి యొకమడుపు క్రిందఁబడియెను. తత్తరపాటున సేనదానింగైకొన యత్నించెనుగాని సమీపవర్తియగు విభావసుఁడందులకెడమీక యాకమ్మఁగొని సచివునకందిచ్చెను. గుండయామాత్యుఁ డద్దాని నిట్లు చదివెను,

హరిద్రకుంకుమశోభితయు, నిరంతర లక్ష్మీప్రసన్నయు భోగభాగ్యయు సదా సుమంగలియునగు వసంతసేనకు.

సేనా! మేమిందు క్షేమమున నున్నారము. నీశుభోదంత మును దెలియవేచినారము. నీవెంతగానకౌశలమున విజయనగరాధీశులను మెప్పించినను లంజపడుచువను దుర్నామము నినువీడదు. నీయందించుకకరుణ వొడమినవారమగుట ఆచెడుపేరుద్రోయ నొక యుపాయమూహించి మాఖాజీవజీరులతో నీజాబుఁబంపితిమి. విషయముపీరినుండివినఁగు. వీరి మనోభీష్టమీడేఱిననాఁడే నినుమారాణులందగ్రమహిషిగాఁగైకొందుము. కార్యముముప్పని యెంచక యొప్పిదమనిసాహసించి తప్పక నెరవేర్పుము. అందునకుపు ప్రయత్నములు ఖాజీవజీరులు నీకుబోధింపఁగలరు. ప్రతిఫలము తప్పకనినుజెందునని సప్రమాణముగా మాకలమంటి వ్రాసినారము. మీఁదు మఱేమియు విశేషములు లేవు. ఇట్లు

ఫిరోజిషాహా,

దౌలత్ నగర్. బహమనీసుల్తాను.

కారాగారాధికారియు విభావసుఁడును తత్రత్యసేవకజన సమూహమును రాయలవారుసద్దాని నాలకించిరి. ఔరా! స్త్రీ సాహసమని యాశ్చర్యరసనిమగ్నులైరి. జాతిస్వభావమును గన బఱచినదిలేయనిరి. రాయలవదనపద్మమున క్రోధదేవత తాండవ మాడుచుండెను. వసంతసేనచేసిన ద్రోహకృత్యమునకు మరణ దండనవిధింపఁబడునని యందఱుమూహించిరి. కాని స్త్రీవధము

ధర్మశాస్త్రవిరుద్ధము గనుక రాయలవారామెను దమరాష్ట్రము నుండి వెడలఁగొట్టిరి.

వారాంగనావిలాసములు చిద్విలాసములు. కృత్యములు క్రూరకృత్యములు అనురాగములు ధరణీపరాగాంకురములు. క్రియలు పాపమిళితములు. మాటలు మృదుమధురములు. హృదయములు కర్కశితమంబులు. మోమునఁ జిఱునగవు. మానసములు గరళగ్రస్తములు. ద్రోహచింత్యములు అతిచంచలములు. స్వప్నసదనములు. మోసమునకిక్కలు. వాల్చూపులే కాలపాశములు. వలపులే కపటవ్యూహములు. ప్రియులపాలిటికాలపాశములు. మిత్రులపాలియసిధారలు. చలచిత్తులపాలి యమదూతలు.

వసంతసేన యెందరిగెనో యెవరునెఱుంగరైరి. స్వామిద్రోహిణియగునీరాక్షసి యింకను నేమిచేయనున్నదోగదా ?

——

## ఎనిమిదవ ప్రకరణము

### సింహాద్రి

మధువనవిహారంబులు మానవులందఱికి నానందజనకంబులు. అందు నిండుజవ్వనులగుమానినీమణులకత్యంతానుమోదమని వేఱుగానుడువవలయునా ?

పానుగల్లునకు యామ్యదిశయం దరక్రోసు దూరమున సింహాద్రిచే వినిర్మితంబగుసాంద్రోద్యానమొండుగలదు. అయ్యు పవనంబు, భూజబృందపరివృతమై లతానికుంజపుంజసంయుతమై పుష్పసౌరభవిరాజితమై ఫలభరితంబై పతంగకులసేవ్యమై నేత్రానందజనకమై యొప్పారుచుండును. జానకివారద్వయంబు క్రిందటనే ముద్దగల్లునువీడి పానగల్లునుజేరియుండెను. నాఁడు తోడిచేడియలు మధువనవిహారమొనర్పఁ దనుఁబ్రార్థించుటచే నెమ్మదిలేనిమానసమైయున్నను జానకి, వారియభీష్టమునుద్రోయఁ జాలకవారివెనువెంటనే యాప్రమదావనవిహారంబున కరుదెంచెను. అందఱునుపవనముఁజొచ్చిరి. పూఁదోఁటఁజేరినపూఁబోఁడులూరకుందురా? ఆమధువనంబున నమందానందకందళితహృదయారవిందలై స్వేచ్ఛగా విహరింపఁజొచ్చిరి.

అంత సింహాద్రిబడలికఁబాపుకొనఁ దనయారామమును బ్రవేశించెను.

కందువారినమోముతోనే తెంచిన తనయన్నను గాంచిన వెంటనే, జానకి, చెలులచెవులతో నేమోగుసగుసలాడ వారందఱునాస్థానమునువీడి తమతమమందిరములఁ జేరఁబోయిరి.

ఆరామమున జానకినిఁగాంచినపు డతని కనిర్వచనీయమైన యానంద ముదయించెను. సోదరిఁజాచినదాది ముద్దగల్లువార్తలారయనాతురుఁడయ్యెను. జానకియొసఁగినయుపహారమునుగుడిచి యొకనింబపాదపచ్ఛాయనువిశ్రమించి జానకితో నిట్లనెను.

చెల్లీ! నీవిచటికాగమనవై యెన్నిదినములయ్యె? ముద్దగల్లునందత్తమామలు గుశలులే? అందలివిశేషములేవియుఁజెప్పకున్నావేమి?

అన్నా! అందులకేకాచియున్నదాన. ఏనిందులకరుదెంచి వారద్వయంబయ్యె. నీవు విదేశమునకేగినావనివినినదాదినామానసము పరిపరివిధాలోచనంబులకుఁ దావలమైయుండెను. శారదనుండికొనివచ్చినలేఖ నెందుదాచిన నేమగునో పరులచేఁ బడిన ప్రమాదముగదా? దీనినెట్లుసంరక్షింతును? నీవెప్పుడరుదెంతువు? ముద్దగల్లువార్తలెప్పుడు నీకు వినిపింతును? అనునాతురత యనంతరము ననుబాధించుచుండెడిది. ఏదియెట్లున్నను శారద యొసఁగినకమ్మనుమాత్రమునాప్రాణముకంటె నెక్కుడుగనెంచి కంచుకమునబొకసంచిని గూర్చిదానినెపుడును భద్రముగాఁ జూచుకొనుచుందును. ఇదిగో కమ్మఁగొనుము. ముద్దగల్లువార్తలనుగుఱించి యిటీవల పలువురుపలువిధములుగఁ దలపోసికొనుచున్నారు. నిజము నిలుకడమీఁదఁదెలియవలెను. అని జానకి సింహాద్రికిలేఖ నొసఁగెను. అతఁడాకమ్మనీరీతిఁ జదువుకొనెను.

ప్రాణప్రియా! వందనములు.

తమసంపూర్ణకృపాకటాక్షమున నేనీముద్దగల్లునఁ గుశలిని. మీాక్షేమోదంతమున కెదురుచూచుచున్నదాన పిమ్మట.

మనోభేదముననో కరుణారాహిత్యముననో అసూయాభావముననోగాని జానకివెంటఁ దమరంపినలేఖఁగాంచి యపారమైన పరితాపమునకు భాగధేయనైతి.

ప్రచండమారుతము వీఁచెననియు, మేఘము చెదరిపోయె ననియు, బర్హినృత్యమాగెననియు విషయపర్యవసానమును షతి కాముఖమునఁ బ్రదర్శించితిరి. కానిండు.

అహమ్మదుషాహా ననుసరించినది వాస్తవము. నేనా యువరాజుతో సంభాషించినదియు నిజము. రాజులయెడలఁ గనఁ బరుపఁదగిన ప్రభుభక్తిని వినయభయభక్తులతో నెఱపినదియు నిశ్చయము. షాహాగారి యసంగతములగు నుత్తరముల కతి నిష్ఠురములగు ప్రత్యుత్తరము లేనొసఁగినదియు సత్యము. దాచిన దిందేదియు లేదు.

రాచూరు వీరభద్రారెడ్డినిఁ బరిణయమాడ తండ్రిప్రబో ధించె. వృద్ధవివాహమున దాపరించు ననర్థముల నిరూపించి యాజ్ఞను దృణీకరించితి.

రాజ్యలక్ష్మికిఁ జెలియలుగాఁ బ్రార్థించిన షాదుషాను అన్యజాతి సంపర్కమపయశఃవంకమున కాకరమని నిరాకరించిన దాన. కారణము లాలోచించుకొనుఁడు. పవిత్రవంతమగు పాక నాటిరెడ్లకులమున జన్మించినయేను, విశుద్ధసంచారిణని పేరొం దిననేను, చిరకాలవిహితులరగు మిముఁగాంక్షించినయేను, అన్యజాతీయులగు మొఘలులవరింతునా? తుచ్ఛసుఖముల కాసింతునా? కులకళంకమాపాదింతునా? ఊహింపరైతిరి.

దుష్టులాడుకొనుదుహూక్తులే సతమనినమ్మితిరి. హృదయ నైర్మల్యయా? కళంకరహితయా? యని పరిశీలింపరైతిరి.

యుక్తాయుక్తవివేచనాశీలురయ్యు నామానసమును బరీక్షింపరైతిరి. మనోహరా! విషయమిట్లుండ వికసించిన విమలసుమమునకుఁ గళంకమాపాదించుట శోచనీయముగదా! ఉండనిండు.

చిరకాలసంబంధమగు బాంధవ్యము. ఎడతెగని ప్రేమానుబంధమునఁ గూడినఁ స్నేహవాత్సల్యము. రక్తసంబంధమగు దాంపత్యము. ఎట్లు వదలును ?

మారుతము శమించును. జలధరము వర్షించును. కేకి స్తరనమొనరించును. ప్రేక్షకులానందింతురనియే నాసంపూర్ణ విశ్వాసము.

మీదు మిక్కిలి జానకినడుగఁ గోరుదాన. విషయముల స్పష్టముగా వివరింప నేనాఁడుదాన. నేరములున్న మన్నింపవేఁడుదాన. వేనవేలు నావందనములందుకొన మఱిమఱిఁ బ్రార్థించుదాన.

ముద్దగల్లు. ఇట్లు మీ శారద.

సింహాద్రి, లేఖను శారదచేవ్రాలును మఱలమఱలఁ బరికించెను. దారిబడలికచేఁ బొడమినశ్రమలంతమై యత్యంతానందభరితపారవశ్యము హృత్పద్మమునుండి పొంగి పైకుబుకుచుండెను. భక్తిపురస్సరముగా లిఖించిన వినయ విజ్ఞాపనములు చమవుకొలఁది తానంపిన యుదాసీనభావమును గనఁబఱచుకమ్మనుగూర్చి మానసము లజ్జనొందసాగెను. కృతజ్ఞతావిశ్వాసములు వెలయించు నాలేఖ నామూలాగ్రముగాఁ బరికించి తలకించి వెల్లివిరియునానందమును దాపలేలులేమి జానకితోనిట్లనెను.

జానకీ! లేఖయందలి విషయములు నిర్భరసంతోష దాయకములు. లేఖావలోకనానంతరమున, నామానసమందలి కల్మషమంతరించె. శారద కుశలియే? కడచినసంగతులు నిన్న డుగ విశదమగునని లేఖనుడువుచున్నది. నీతోఁబుత్తెంచిన శారదా సందేశమును వినిపించి వీనుల విందొనర్పుము.

జానకి చాలనేర్పరి. తావిన్న ముద్దగల్లు వార్తలన్నియు నొక్కసారియే వినిపించినఁ దనయన్న యగాధమగుసంతాపమునఁ బడునని యాలోచించెను. విన్నసంగతు లెటులయినను సోద రుని చెవిసోకక పోవనియునూహించెను. ఎట్లయినను విషయ ముల దాపవీలులేదుగదా యని మానసమును స్థిరీకరించెను. మంచిని ముందుగ్గడించి యనురాగమునుబెంచుటయే సమంజస మని యెంచెను. చెడుగునుగూర్చి యనంతరమున దుఃఖోపశ మనవాక్యముల శాంతిఁగూర్పనగునని సింహాద్రితో నిట్లనియెను.

సోదరా! యేనుముద్దగల్లుజేరిననాఁడే మామచింతాద్రి రాచూరునుండి యరుదెంచె. వచ్చినవెంటనే యించుకేని విశ్రాంతిఁగొనక, శారదనుజేరి వీరభద్రారెడ్డినిఁ బరిణయమాడఁ బ్రబోధించె.

ఈవిషయమునుగూర్చి, శారద, జాబునందుక్లుప్తముగాఁ దనస్థితిని వెల్లడించినది. వీరభద్రారెడ్డి వివాహవిషయమునఁ దండ్రిబిడ్డలసంభాషణమునువిన మనమాతురపడియెడి తెల్పుము.

తెల్పుటయేమి? విషయచర్చయందు శారద మొదట తండ్రికెంతయో వినయమును గనఁబఱచెఁగాని, వీరభద్రారెడ్డి భాగ్యవంతుఁడనియు, నభిమానవంతుఁడనియు, యశోవంతుఁ

డనియు, గుణవంతుఁడనియు, నాశ్రితాళిచేఁ బరివేష్టింపఁబడిన వాఁడనియు, నాతనిగుణగణంబు లభినందించుచు, నెల్లయినను నాతనికిచ్చి పెండ్లి చేతుననియు తండ్రియాజ్ఞ చెల్లించుట తనయకు విధాయకమనియు ముందుకు తనయాజ్ఞకు మాఱాడఁగూడ దనియు కఠినముగా గద్దించి పల్కెను.

మామగారి కఠినోక్తులకు శారద భీతిల్లకుండెనా ?

భయమంద లేదుగాని, వినయవృత్తిననుసరించియే న్యాయ నిష్ఠురముల నొడిగట్టుచుండె.

అదెట్లు ?

అన్నా ! శారద స్వయముగా నాఁడినమాటలే నుడువు చున్నాను. "తండ్రీ! వీరభద్రారెడ్డి భాగ్యవంతుఁడంటివి. బల వంతుఁడంటివి. గుణవంతుఁడంటివి. కీర్తిమంతుఁడంటివి. స్వజాతి సంబంధుఁడంటివి. నూరువన్నెల నొక నీలిమ్రింగెనను సామెత గానిన్నిగల్గియు నాతఁడు వృద్ధుఁడు. నీవు కేవలము ధనాశాపాశ మునఁజిక్కి, కాకిముక్కునకుఁ దొండపండలరికరించుకరణి నన్నా తనికిఁగట్ట దృఢపడితివి. ద్రవ్యాసక్తమనస్కులు కడుపారఁ గాంచిన తమముద్దుబిడ్డల నంగవైకల్యులకును, నీచజాతులకును, వ్యాధిబాధితులకు నొసఁగి యనల్పకాలమున వారుగతింప, వైధవ్యము ననుభవించు తమకూఁతుల నెదుటనిడుకొని కుందు చుండుటఁ గనులారఁగాంచియు నీవు గారాబమునఁ బెంచిన నాపైననా కనకు సీకీచలము ? జనకా ! నేఁజూడని వీరభద్రా రెడ్డిగాఁడు. అతనికి మోమున వికాసమంతరించినది. నడుము వంగినది. మేనుముదిరినది. కఱ్ఱచేతి కందినది. ఇట్టి జరాభార

పీడితునకు ననుఁగట్టి దుర్వ్యథపాలుగావించకుము. ఇదిగో! మఱల మఱల విన్నవించుచున్నాను. కేల్మోడ్చి మ్రొక్కుచున్నాను. మేనత్తకొడుకు. రక్తసంబంధము. అనుకూలదాంపత్యము. వయోవంతుఁడు. విజ్ఞానకుశలుఁడు. సుందరాకారుఁడు. ధీరోదాత్తుఁడు. నీకు మేనల్లుఁడునగు సింహాద్రిరెడ్డిని మనోవాక్కాయకర్మల వరించినదాన. ఈనాయీప్సితము నీడేర్ప మఱి మఱి నిను బ్రార్థించుదాన. అటుగాక నీదుమ్ప్రియత్నమునకు విధియనుకోడైనచో నాఁడే కూపమో తటాకమో ఉరియో నాబలవన్మరణమున కాకరమగుఁగాక" అనిపల్కి శారద యాచోటువీడెను.

అందులకు మామగారేదియుఁ బ్రత్యుత్తరంబీయలేదా?

వారును క్రోధఘూర్ణితమానసులై వెడలిపోయిరి.

సింహాద్రిమోము వికసించెను. శారదధైర్యమునకచ్చెరువందెను. తన్నేపరిణయమాడ నెంచెనని యాతనికి దృఢపడియెను. తన మీఁదత్యంతానురాగముగలదను నమ్మక మతనికిఁ జనించెను. అత్యానందమొదవ వెలలేనికోరికలు కోటలు దాఁటుచుండెను.

మానవులకు సుఖదుఃఖములు కావడికుండలు. క్షణభంగురములు. మనుజులు సుఖమొదవిన నానందింతురు. కష్టమొదవిన దుఃఖింతురు. ఇదిలోకసామాన్యము. ఏ శారదనుఁగూర్చి

సింహాద్రి యుబ్బితబ్బిబ్బులగుచుండెనో యాశారదనుగూర్చియే జానకి, మరల నిట్లుతనితో విన్నవించెను.

అన్నా! ఇంకొకవిషయము. చెప్పసాహసించినందులకు మన్నింపవేఁడుదాన. ముద్దగల్లున మామగారింటిని దొంగలు దోచిరఁట. వారుచోరులని కొందఱనుచున్నారు. సాహుగారి గూఢ చారులని కొందఱు నుడువుచున్నారు. అత్తమామలను కారాగారమున బంధించినారని యొకవదంతి. శారద పలాయన మైనదని వేఱొకవార్త. నిన్ననే యీవానుగల్లునందే విన్నదాన. ఏదినిజమో బొంకేదియో నిలుకడమీఁదఁ దెలియవలసియున్నది. ఈవార్త విన్నపినతండ్రిగారు నిన్ననే ముద్దగల్లునకు బ్రయాణ మును సాగించినారు.

జానకినోటినుండి యిపుడు వెడలిన దుఃఖోక్తులచే సింహాద్రికి మిన్నువిఱిగి మీఁదఁబడినట్లయ్యెను. అవయవములు చైతన్య రహితములయ్యెను. ఆలోచనముఁ దోఁచుటలేదు. మానసము పనిచేయుటలేదు. రెప్పవాల్పని యొకేదృష్టి. మ్లానవదనుఁడు. ఇట్టి దారుణంబగు విపదబ్ధినీదుచు నేలకొరిగెను.

జానకి బాలిక. ముందువెనుకలరయనిముగ్ధ. కష్టసుఖంబు లెఱుంగనిగోల. ఏమి సేయఁగలదు? అన్నా! ఆరంభమున నా నందమును గూర్చితిని. తుదకు అపారమగు పరితాపవార్ధిని ముంచితిని. అని యంగలార్చుచుఁ బైటచెరగుచే విసరుచు,

వినయంపుఁ బల్కులనాదరించుచుఁ, దగు శుశ్రూషలొనరిం
చుచు, సేదదేర్చుచుండెను.

జానకి శుశ్రూషలచేఁ దెలివొంది సింహాద్రి శారదను
గూర్చి యిట్లు శోకింపఁజొచ్చెను.

శారదా! జానకిచే నేనంపిన నిష్ఠురలేఖయే నీమానస
మును వంతఁద్రోసియుండ "గోరుచుట్టుపై రోకటిపోటనురీతి"
పైన నీకీయాపత్సంఘటనమా? అయ్యో! నీసంతాపాతిశయ
మునకు మేరయేలేదుగదా? మాశారద యత్యంతప్రేమోదధియై
జనకాజ్ఞ నుల్లంఘించి నన్నే వరించెనని నామిత్రమండలితో నీ
యుదారహృదయమును వెల్లడించి యానందించుమంచిదినములు
దూరమయ్యెగా? శారదా! నీచెంత కరుదెంచి అనురాగపూరి
తంబులగు మనయిర్వురిహృదయంబులుద్రవించి యుభయమాన
సము లేకీభవించి అపాంగవీక్షణములైక్యమగు సుదినములు
దొలఁగి పోయెగా? అకటా! నీమందహాససుందరవదనారవింద
మునుగాంచి ప్రహృష్టహృదయుఁడనగు సంతోషదినములు గడచి
పోయెఁగా! కడుసుకుమారివగు నీయుత్తమాంగమును గటికలగు
మొగలులంట నను దలఁచి జరిగినయనర్థమునుగూర్చి యేమను
చుంటివోగదా? కర్కశతమవజ్రహృదయులగు ముష్కరతురు
ష్కులప్రియంబులు నినుఁదూలనాఁడ — కందితో, కుందితో,
పరితపించితో, శోకించితో, శోషించితో, జెప్పువారెవరు?
శారదా! మన యిర్వురి లేఖావాదములుంచుకేని ఫలోన్ముఖంబు

గనక, పవిత్రవర్తనవగు నీపై నపవాదంబు మోపినపాపంబు నాకును, నాకై జనకాజ్ఞఁదోలినయఘంబు నీకును, వెన్నంటి యుండు దుర్దినంబులివి యని తెలియనైతి. తెలిసియుండిన నాఁడే పానుగంటిని వీడి నీసమక్షమున నుండకుందునా? అట్లుండినచో నిర్భరమేదో యొక గతిఁబట్టుదుము గదా? అదియును లేదయ్యె. కటా! దైవమా యెంతటిదుర్దశ పాలొనరించితివి? నాశారద నెందుఁద్రోసితి? ఎచ్చట దాగియున్నది? ఎందున్న దని యారయఁబోదు? శారదగుట్టుఁదెలియ నేరీతిఁజరింతు? ఎందుఁజొత్తు? పరివ్రాజయింతు? ఎట్లా తురుష్కులను బోరి కొందు? జానకీ! శారదజాడ నాకిఁకఁ దెల్పుపుణ్యులెవరు? తండ్రియెల్లుండియో నేఁడో పురికరుదెంచును. మాత ముదుసలి. ఆవృద్ధదంపతుల సంరక్షణమునకుఁ దైవము నిను నియమించె. శారదారక్షణము నాపై మోపె. నేఁ బోయెద. తురుష్కులఁ జంపెద. శారదను దెచ్చెద. మీఁదు నీయిష్టమని సింహాద్రి యొదులకో వెడలిపోయెను. అంతరించిన విషమావస్థను దలఁచి దలఁచి దుఃఖింపుచు జానకి పానుగంటిలోని స్వగృహంబును జేరఁబోయెను.

—

## తొమ్మిదవ ప్రకరణము.

### వెన్నెలరాత్రి

పేదకు భిక్ష మొదవినరీతి యువజనులకానందదాయకము వసంతాగమనము. సంతోషమున్నచోట దుఃఖముఁ దలసూపుట సహజమే గదా? మధుమాసముల భూగర్భమునుండి జనించెడి యుష్ణముపశమింపదాయిగానమి నిశీథులందు మందమలయానిలమునకే కోరుచు సామాన్యజనులు వీధితిన్నియలపైనను, గృహాంగణములయందును, బడి పొరలుచుందురు. కువలయానందసంధాయకుఁడు దౌలతాబాదుపాలగచ్చుమేడలపైఁ బ్రసరించుచుండెను. ఉడుగణంబులు తమ రేనికి మఱింతవన్నెఁ బెట్టఁదమ స్వకీయకాంతిఁగూడను సమర్పించినవో యన మినుకు మినుకుమని కళాహీనమై గన్పట్టుచుండెను. పతంగసంతానములు తమ ఋతంబులనుమాని గూళ్లుచేరి నిదురగూరుచుండెను. జాబిల్లి ప్రకాశమెక్కుడగుకొలఁది, భూమండలమంతయుఁ బిండి యారఁబోసినటుల నిండువెన్నలదాండవమాడుచుండెను. దౌలతాబాదుపరిఘచుట్టునుండెడి ఖేయమందలియంబురాశిపై శీతకరకిరణజాలములు బ్రసరించి యందఱికన్నిరూపుల నర్తనమొనరించుచుండెడివి. వెన్నెలపులుఁగుల కీచుకీచుధ్వను లందందుఁ గర్ణగోచరంబగుచుండెను. గాలిదేవుఁ డనుగ్రహింపమిఁ బొడమిన యుక్క కోర్వఁజాలక మహమ్మదుషాహా రంగమహాలునందు విశ్రమింపఁగోరెను అది ఏడంతస్తులమేడ. ఉపరిభాగమంతయు, తెల్లగారచే చెలువమరియుండెను. మేడయుపరిభాగమందలి యా

వరణకుడ్యములు మృణ్మయకుంభములచేఁ బొదుగఁబడియుం డెను. కుడ్యశిఖరముల నానియాడెడు తొట్లయందుఁ బెరిగిన పన్నీటిచెట్లయందలి ప్రసూనసౌరభములు దిశలావరించుచుం డెను. మధ్యకక్ష్యయందు పాహోవిశ్రమింప హంసతూలికాతల్ప మొకటి విరాజిల్లుచుండెను. ఉదయించినవెన్నెలకుఁ దోడా సెజ్జపై ధవళాంబరము పరుపఁబడియుండెను. పాన్పునకు పార్శ్వ ద్వయంబులబల్లలపై వెల్లవసనములఁబఱచి తదుపరిపునుఁగు జవాదులుంచిన దంతపుబరణులు నత్తరుబుడ్లు స్వర్ణపాత్రములు గంధపుగిన్నెలు పన్నీరుచెంబులు తాంబూలపేటికలు నేత్రానం దకరముగా బ్రకాశించుచుండెను. ఫలాహారములు, నింపిన వెండిపళ్లెరములు, క్షీరద్రాక్షారససంభరితహేమకలశములు వేఱొక బల్లపై వెలయుచుండెను. హారములుగాఁ గూర్చిన మల్లెసుమములఁ దల్పముపై నిబిడముగాఁదీర్చి కొందఱంగనలు వెడలిపోయిరి. పన్నీటికలశమందలి సువాసనాంబువుల ముద్ది యలు గొందఱాసరులపైఁ జల్లియేగిరి. వట్టివేళ్లవీవనపై పన్నీరు చల్లి వానిఁబట్టికొని కొందఱు సుందరులు నిలిచియుండిరి. సరిగం చుల రాణించుధవళాంబరధారిణులగు కొందఱందగత్తెలుమేలి ముసుంగులిడి తమగానకళాకౌశలముఁజూప విపంచికలను చితా రులను జేకొని వేచియుండిరి.

గణగణమనిగంట మ్రోగెను. ఆనాదము పురమంతట ప్రతిధ్వనించెను. యువరాజరుదెంచుననిని అంగనలందఱు బద్ధాంజలులై నిలచియుండిరి. పురిప్రజలందఱు తమపనులఁ జాలించి కవాటముల బంధించి నిదురింపనేగిరి. పాహో రంగము

హాలుప్రవేశించెను. చేడియలందఱు జోహారులొనర్చిరి సుల్తాను తల్పముపై సుఖాసీనుఁడయ్యెను.

ఆహా ! అతిశయించినయావైభవమువర్ణింప నేరితరము ? పరిమళచందనమును మేనునలందెడికుందరదనలు, వీవనలు చేఁబట్టి విసరుచుండెడిచామరగ్రాహిణులు, మెప్పావడయ సుమహారములఁ గంఠసీమనలంకరించెడుసుందరాంగులు, జిలిబిలిపలుకుల హాస్యోక్తులాడి హర్షమొదఁగూర్చు చతురాంగనలు ఉపహారములనందిచ్చుచంద్రాననలు, ద్రాక్షారసంబునుజేపట్టి త్రావించు ముద్దుగుమ్మలు, పలువిధోపచారముల షాహాప్రేమకుఁ బాత్రులుగాఁ జూచుచుండిరి. మేలిముసుంగులిడినమంగళవతులు తమవిపంచి కలఁగొని స్వరశ్రుతికనుగుణముగా నతిలలితరీతి మంద్ర, మధ్యమ, తారంబులపైఁ దమయంగుళులునాట్యమాడ కోకిలస్వనంబున రాగాలాపనంబొనర్చిరి. ఆదివ్యగానసుఖానుభవంబున యువరాజునకనిర్వచనీయంబులైనభావంబులుదయింప మానసమునకేదో వికారమొదవి గానమాప నాజ్ఞయిడెను. పరిచారికలందఱెవరి త్రోవ వారేగుటచే షాహా యొక్కఁడే తల్పముపైనటునిటు పొర్లాడసాగెను. ఇతఁడేల హఠాత్తుగా నిట్లు వికలమానసుఁడయ్యెనో తెలియ మాచనువరులాతురులైయుందురు. తరుణవయస్కులుపాడినరాగాలాపనమున షాహామానసము లీనమగుడు ముద్దగల్లుబాలికాపాఠశాల కట్టెదుటసాక్షాత్కరించెను. యుక్తవయస్కులగుబాలికలందఱిపై భావనాదృక్కులుప్రసరించెను. అయ్యుపతులందే శారదాబింబము ప్రత్యక్షమయ్యెను. శారదయారంభమునఁ బాడినరాజాశీర్వాదము జ్ఞప్తికిఁదలెను. మంగళ

గీతమునుబాడునపుడు అవ్యక్తమధురస్వనముననుసరించు నాశాంత నాదము, రాగాలాపనమొర్చునపుడు మూర్ఛలందులీనమయిన యరగంటిచూపులు, సుల్తానుహృత్పద్మమున గాఢముగానాటి ద్రవీభూతునిఁజేసెను. ఖాజీయిడినప్రశ్నల కమ్మానినియొసంగిన సమాధానవిజ్ఞాపనములు జ్ఞప్తిరా సుల్తానునకుఁ జాలిరొదవు చుండెను. తానిడినకఠినప్రశ్నములకుఁజంకక యామెలేమశతగుణాధిక ముగానొసంగిన వినయవిన్నపము లాతనివిపులాంతఃకరణమును మఱింతవృద్ధిఁజేయుచుండెను. తుదకామెయొసంగినయసంగీకార మునుగూర్చి ప్రయత్నము విఫలమేయని చింతిలఁదొడఁగెను.

ప్రేమవికసితనయనారవిందములయందలిబెడంగు, అమృతోపమానంబులగు మృదుమధురవాగ్ధారలు, మనోహరంబగు కోమలతనువల్లి. వెను వెంటనేజ్ఞప్తికిరా దృశ్యప్రపంచమంతయు శారదామయమై భావసంజాతవేదనాదవానలంబునఁ జిక్కియాసుమశయ్యఁబొరలుచుండెను.

ఇట్టివిపరీతావస్థను మునింగియున్న అహమ్మదుషాహాదృష్టిపథమున నొకమానవవిగ్రహముగోచరించెను. పోతుటీఁగయైననుజొరశక్యముకాని, రాజాంతఃపురమున నట్టినిశీధినిఁ, గావలివారిఁదాటి, యంతిపురమును బ్రవేశించు స్వతంత్రుడెవఁడగు? ఎల్లవేళలనిచ్చకములాడి షాహామానసమునకుమోదమునుగూర్చుచుండెడిఖాజీయే! ఖాజీనిఁగాంచినవెంటనే యువరాజభివాదనంబర్పించి యుచ్చాసనమునఁ గూర్చుండవేడెను. కుశలవార్తలఁ బ్రమోదమగ్నునిఁగావింప నెన్నియో సంతోషవాక్యములాడెను గాని హృదయనైర్మల్యములేనిఖాజీకి మహమ్మదుసరసోక్తులు

హర్షదాయకములుగాకుండెను. అతఁడు దీర్ఘాలోచనాతత్పరుఁడగుటకుఁ గారణమారయఁగోరి సాధుసా యిట్లనెను.

సాధూ నేఁడేలకో మీావదనపద్మము దీనభావమును సూచింపుచున్నది. బహమనీసుల్తానుల నాశ్రయించిన సాధువులకెల్లను నిత్యానందము తోడునీడయైయుండఁ దమచింతకుఁగతంబుఁగానక నామానసము వ్యథనొందుచున్నది. నాయందెవ్వియేని లోపంబులోదవెనా ?

పాపము శాంతించుఁగాత. దీనరక్షణాతత్పరులగు మీాకు, మాబోటిసాధుజనులయందెగ్గొదవిన లోకము నిలుచుటెట్లు ? ప్రజలు మనుటెట్లు? ఈనాచింతకుఁగారణమువేఱు. ఏమందురా? మనప్రయత్నము విఫలమైనది.

ఏమీా ? యువరాజుప్రయత్నమువిఫలమా ? అదికల్ల. సూర్యుఁడు దిరుగుచున్నాఁడు. పగలు జరుగుచున్నది. ఖడ్గమొర యందింకను నిముడలేదు. అది బైటనే చరించుచుండ ప్రయత్నము విఫలమగునా ?

తామిపుడట్లు సెలవీయరాదు. కార్యము మిగిలిపోయినది. స్థితిగతులననుసరింపఁ గర్తవ్యమేప్రధానాంశము. ప్రమాదము తటస్థించె. ప్రజలు తెగించిరి.

మీామానసమున కింతవంతనుగూర్చిన విషయమెద్ది ?

గూఢచారులమై రాష్ట్రమర్మములాగయఁబోయిన వారవుక్రిందటి రహస్యవిషయములు,

ముద్దగల్లు పానుగల్లుదుర్గముల రహస్యవిషయములా ?

అవును. అందగ్ని పుట్టి, పొగ తేగి, మంటమండినది.

మనచారులస్థితిగతు లెట్లు పరిణమించినవి ?

వారందఱుఁ బ్రజలచేఁ జాతరపేరఁ బొరిగొనఁబడిరి. ముద్ద గల్లునందలి రక్షకభటులందఱు హతులైరి. రాజభండారమంత యుఁ గొల్లవెట్టఁబడియె. మనప్రభుత్వము నంగీకరింపక ప్రజ లాంధ్రరాజులకు లోఁబడనున్నారు.

అయిన నిప్పుడే చతురంగబలముతో నేగి ముద్దగల్లు పౌరులఁ జెరఁగొందము.

మీరే యంతటిస్వతంత్రమును బైవేసికొనుట నాకని ష్టము. ఆంధ్రరాజులందలి కట్టుదిట్టములఁగూర్చి నవాబుగారి మానసము శంకాసహితముగనున్నది. ముద్దగల్లునందలి యల్ల రులకుఁ గారణభూతులుమీరే యని తెలిసినచో మీయందించుక కినుక నూనగారణమగుఁగాన నాలోచించి కార్యమునుసాధించిన బాగుండునని తోఁచుచున్నది.

ఈవిషయమై సుల్తానుగారికింకను నెద్దియుఁ దెలియదు. వారికెఱుక లేకయే మున్ముందీయల్లరులనణచుట యుక్తము.

పిమ్మటనైన వారికీవిషయము తెలియకుండునా ? అపు డపవాదము మీపైనవేతలసూపును. వేఱువిధముగాఁ గర్తవ్య మును సుల్తానుగారికే వదలుట సమంజసము.

సదుపాయమెద్ది ?

మనయందిపుడు స్వయూథకలహము లాగిపోయినవి. సామంతులందఱు నైకమత్యము నాపాదించుటయకాక పీరోజి షాహాగారి యాజ్ఞలను దలఁదాల్చుచున్నారు. ముద్గల్లునం దొనర్చిన ప్రమాద మాంధ్రరాజులే యొనర్చిరని ప్రవాదమును గల్పించి, సుల్తానుగారి నీర్ష్యాసహిష్ణులుగఁజేసినచో వారుతప్పక నాంధ్రులపైఁ బడుదురు.

ఇట్లొనరించిన దాన మనకగులాభ మెద్ది? నష్టమే సంభవించును.

ఇది నష్టమెట్లగును? దీన రెండువిధములగు లాభములు మనలఁబొందనున్నవి. శారద మీయర్ధాంగియగుట మొదటిది. ఆంధ్రసామ్రాజ్యమంతయు మీకులోఁబడి కప్పములుగట్టుట రెండవది.

ఆకాపుకన్య యిపు డెందున్నది?

ఆజవ్వని యెటకో వెళ్లినది. జాడలింకను బయలుపడలేదు. చింతాద్రిరెడ్డిని నతనిసతిని చెఱవిడిపించినతర్వాత విజయనగరమునుజేర్చినారని కింవదంతి. మనగూఢచారులుగూడ నట్లే తలంచుచున్నారు. మఱియొక విశేషాంశముకూడ కలదు. ఆంధ్రులపాలికల్పద్రుమమై దిగంతవిశ్రాంతకీర్తిఁగన్న విజయనగర సార్వభౌముఁడగు హరిహరరాయలు పుత్రశోకానలదగ్ధమానసుఁడై గతమాసమునఁ గీర్తిశేషుఁడయ్యె. ఆతనికనంతరము

యువరాజు నరిభయంకరుఁడు నగు దేవరాయలు రాజాధిరాజ రాజపరమేశబిరుద విభ్రాజితుఁడై సింహాసనారూఢుఁడై రాజ్య తంత్రముల నవలీలగా నిర్వర్తింపుచున్నాఁడు.

ఆలాగా ? ఇది మిక్కిలి భయంకరవార్త. తుపాకివెల్లి ఫిరంగివచ్చినది. ఇంకేమున్నది ?

అల్లా మనపక్షముననున్నాఁడు. ఇపుడు కాలాతీతమైనది. నేముద్దగల్లునకేగి మఱియునందలి గూఢాంశములనెల్ల నెఱింగి యేతెంచెద.

అని పాషాచెవిలో నేదియో గుసగుసలాడి ఖాజీ వెడలి పోయెను.

---

## పదియవ ప్రకరణము

### ప్రయత్నము

ఖాజీ చిత్తమతిచంచలము. ఆలోచనంబతిపాపమిళితము. ఊహాలో యవి మారుతవేగములు. కృత్యములు మోహాసమ్మేళనములు.

ఖాజీ ముద్దగల్లుఁ బ్రవేశించెను. చింతాద్రినిబంధవిముక్తుఁ జేయుటయందు రఘునాథశర్మ తోడ్పడెనని వేగువెట్టి తెలిసికొనెను. విజయనగరమున చింతాద్రిభార్యతో సుఖమైయున్నాఁడనువార్తగూడ చారులచే వినెను. శారదవియోగమునఁ బరిత

పించి పరితపించి యామొహమ్మదయేశ్వరుఁడగు సింహాద్రివిదేశగతుఁడై తుదకు విజయనగరసార్వభౌమునాస్థానమున కేగి యతని మన్ననలకుఁ బాత్రుఁడై సేనానియై యరిమర్దనమునకై వేచియున్నాఁడనియు నెఱింగెను. అంత దౌలతాబాదున కేగి యువరాజును సందర్శించె. కుశలప్రశ్నానంతరమున వారిట్లు సంభాషించిరి.

సాధూ! మీప్రయత్నములు, సఫలములై లాభమును జూపెట్టినవా?

సఫలములని నొక్కి చెప్పుటకు వీలులేదు. కొన్ని యుదంతములుట్టికెక్కినవిగాని యూఁగులాడుచున్నవి. అచ్చటిమాటకేమిగాని తర్వాతంజూచికొందము. మీప్రయత్నములు సఫలములా?

కడుప్రయాసమున ఫలోన్ముఖమునకు రాఁజాలినవి.

అదియే పరమసంతోషము. షాహాగారు కడుకినుకనూనిరని తలఁచుచున్నాను.

లేదు. సహజభీరువులని మనసునుకొన్నయభిప్రాయమున కించుకేనియు వారుచోటిడలేదు.

మీయభీష్టమునకు సమ్మతించిరా?

ముందునామనవినంతయు సావధానముగా వినిరి. విజయనగరమునకు సందేశమంప నేఁ బ్రార్థించితి. నాప్రార్థనమంగీకరించుటకు ముందెంతో దీర్ఘముగా నాలోచించిరి. సందేశమునకు వలయుత్రోవలన్నియు నావల్లనే తెలిసికొనిరి. మార్గములన్ని

యుఁ బూసఁగ్రుచ్చినట్టు నివేదించితి. ఆలోచనానంతరమున కదన మునే ముమ్మందుస్థిరీకరించిరి. పలుమాఱు జననష్టమును, ధన వ్యయమును, వ్యర్థప్రయాసమును బాడమనున్నవిగదా? యని వితర్కించిరి. సామంతరాజులమైకమత్యమును వారుదోడ్పడు తెఱఁగును, మొఘలుసేనలచేవయు పెసరగాయఁజీల్చినట్టు విప్పి చెప్పితి. నాప్రార్థనంబుఁదోయవిధిలేమి విజయనగమునకు సందేశ మంపిరి. శారదయునికి యేమయినఁ దెలిసినదా?

ఆయువతిజాడ గగనకుసుమమయినది.

అయిన మీరొనర్చినప్రయత్నము?

చింతాద్రి విజయనగరమునందున్నాఁడని జాడఁదీసితి. శార దను వెదకి సింహాద్రి విదేశగతుఁడై విజయనగరమున సేనానియై యున్నాఁడనుగుట్టుఁ దెలిసితి. శారదనుగూర్చి విచారించుచునే యున్నాఁడ. అమితాలోచనంబుల మిక్కిలి స్రుక్కినాఁడ. ఊర కుందునా?

మీయాలోచనంబువ్యర్థముకాదనయే నాదృఢమైననమ్మ కము. ఎవ్విషయమునుగూర్చి తామిపుడింతదీర్ఘముగా నాలో చించుచున్నవారలో?

సింహాద్రిపినతండ్రికూతురు జానకియనునొకజవ్వని పాను గల్లునందుఁగలదఁట. ఆయువతి చాలనేర్పరియఁట. అతినిపుణ ముగా శారదా సింహాద్రులకు ననురాగమును బెంచినదఁట. అందుచే వారి యన్యోన్యానురాగలత దినదినాభివృద్ధియై పై వా

హీంకానుబంధమున కృతనిశ్చయులై యున్నారఁట. సింహాద్రియం దలి ప్రేమమపారమగుట శారద, తన తండ్రి గుదిర్చినవరునొల్లక సింహాద్రినే పరిణయమాడఁ బ్రతినఁబట్టినదఁట. మైత్రియందు జానకీశారదలకుమేనులురెండైనను, ప్రాణము లొక్కటియే యఁట. శారదగుట్టంతయుఁ జానకి పిడికిటఁగలదఁట. ఈవిష యములన్నియు నిపుడే తెలిసికొన్నాఁడ. జానకి దర్శనమెట్లు బ్బును? ఆయువతినుండి శారదజాడ లెట్లు బయటికి వెలువడును? ఆమగువకందాప్తులెవరు? ఏనే పానుగల్లునకేగిన బాగుండును గదా? అచ్చట నాకెవరుహితులు? ఈమొదలగు విషయము లన్నియు మానసమునకుఁదట్టి ముందువెనుకఁదోపమి నల్లాడు చున్నాఁడ.

బాలికాపాఠశాల యుపాధ్యాయుఁడగు రఘునాథశర్మ మనకాప్తుఁడు గదా? అతనిని విచారించినచో విషయములన్ని యుఁ దేటతెల్లముగాఁ దెలియునగు. ఉన్నచో బిలిపించి విచా రింతము.

రఘునాథశర్మవిషయమై మనమనుకొన్నట్లు జరుగలేదు. అతఁడు స్వమతాభిమాని. కారాగారబంధితులైన చింతాద్రిని నాతనికళత్రమును విడిపించుటయందు పౌరులందఱిపోగుచేసిన వాఁడితఁడనివింటి. మనకాప్తునివలె పైకిఁగన్పట్టినను నతనిమాన సము పయోముఖవిషకుంభమనుట సత్యము. ప్రకృతమున నతఁ డూరలేఁడు. ముద్దగల్లునందు కొందఱు ఘనులందిఱఁడేకమయి

మనల నెన్నో గొప్పకష్టములఁ ద్రోయనున్నట్లు సూచనలగపడి నవి. మొన్న ముద్దగల్లునందు జరిగినప్రమాదమునకంతయుఁ గారణభూతుఁ డీరఘునాథశర్మయే.

అట్లయిన వానిఁ బారిగొన్న మనకార్యములు నిర్విఘ్న ముగ నెరవేరునుగదా? ముందట్లొనరించి యీభీతిఁ బాయుదము.

అది మఱింతప్రమాదమునకు హేతుభూతంబగు. పిల్చిన వారిచేతి బిడ్డయై పౌరులందఱిచే నన్నివిధముల రఘునాథశర్మ మెప్పొందినవాఁడు. ఇట్టి తరుణమున మనమీయకృత్యమునకుఁ జొటిడినఁ దప్పకముప్పువాట్లిల్లఁ గలదు. సామమే కార్యసాఫ ల్యమునకు మార్గదర్శకము.

నాఁడు బాలికాపాఠశాలను దర్శింపఁబోయినపుడందుఁ జానకి యుండెనా?

లేదఁట. నాడాసుందరి, పాఠశాలకు రాలేదనియే వింటి.

జానకిగూడను సుందరవతియగునేమో?

నేవినుటయందుఁగూడను స్ఫురద్రూపిణియనియే వదంతి గలదు.

ముందీజానకిఁజెఱఁగొన్నఁ బ్రయత్నంబులన్నియు ఫలిం చునని నాకూహదట్టుచున్నది.

అవ్విషయమునుగూర్చియే నేనును నాలోచించుచున్నాఁడ.

పానుగల్లునకుఁ బ్రయాణము తూఁగింతమా?

అదియే యిప్పటి కార్యశేఖరమున కనుకూలమగు సన్మార్గము. వీరిర్వురిట్లాలోచించి, తుదకు పానుగల్లునకే ప్రయాణమును సాగించిరి.

ఆహా! దుర్జను లెంతటిపాపకార్యమునకైన నొడికట్టుదురు గదా!

---

## పదియవ ప్రకరణము

### విజయనగరము—పౌరమహాసభ

యుక్తాయుక్తవివేచనాశీలురాంధ్రావనీపతులు. విషయచర్చ, ఘనకార్యములకత్యంతావశ్యకమని వారియాశయము. పౌరులను గన్నసుతులవోలెఁ గాపాడు పార్థివులందీగుణములు సహజముగా ననువర్తించుచుండును. విజయనగరమందలి పౌరలోకమంతయు నొకచోఁజేర్చి గొప్పసభఁగూర్చునదిగా దేవరాయలు మంత్రులకు ముందే యాజ్ఞనిచ్చియుండిరి. తత్సభావిషయమై తగునేర్పాటులన్నియు నమాత్యునిచే మున్ముందే నవరింపఁబడియుండెను. నగరవాస్తవ్యులందఱుఁగారణ మారయనాతుర్లై సభఁ జేరవచ్చుచుండిరి. కేరళనరసింహరాధ్యులును, ఓరుగంటి కృష్ణదేవులును నరుదెంచి సభనలంకరించిరి. సామంతప్రభువులచేతను సైన్యాధ్యక్షులచేతను, ఉన్నతోద్యోగియుల చేతను, పురిఘనులచేతను, నిండినయాపేగోలగము కనులపండువొనర్చుచుండెను. యువరాజగు హరిహరరాయలుగూడ నాసభ

కరుదెంచెను. అందఱు రాయలకొఱకు వేచియుండిరి. ఉత్త మాశ్వములఁబూన్చిన స్యందనంబధిరోహించి దేవరాయసార్వ భౌముండేతెంచి సింహాసనంబధిష్ఠించెను. గుండయామాత్యుఁడు యామ్యదిశయందును, ముద్దనమంత్రి వామపార్శ్వంబునను నిల్చి రాయలకు జొహారు లొనరించిరి. సభ్యులందఱులేచి తమతమ రాజభక్తిఁ జూపువందనములు వెలయించిరి. అందఱికిని స్వాగత మొసఁగి రాయలు సుఖాసీనుఁడయ్యెను. గుండయ మంత్రి ముఖులు సుల్తానులంపినసందేశమును సభ్యులకువినిపింప రాయ లానతికెదురు జూచుచుండెను. ఆజ్ఞయొసఁగఁబడెను. సచివుఁడు సభాధ్యక్షులను సభ్యులను సంబోధించి సందేశము నీరీతిఁజదువ నారంభించెను.

విజయనగరసార్వభౌములగు దేవరాయలకు,

తేడా! ఆంధ్రులు, సూనృతవాదులని, సత్కర్మనిరతు లని సుజనానువర్తులని మాటమాత్రమెకాని ముద్దగల్లునందు మీయువరాజొనర్చినదుండగములే మీదుశ్చరితమును వేనోళ్లఁ జాటుచున్నవి. ఆదుర్గమందలి ప్రజలు మాపాలనమునకంగీకరిం పక మీ‍రుపన్నిన కృత్రిమవ్యూహంబులఁ బొలుఁగొన్నను దుర్గ పాలనాధ్యక్షత మాయందేయునువర్తించుటఁ తెలిసినవిషయమె గదా? అట్లుండియు, చింతాద్రిరెడ్డి తనయయగు శారదను, మీయువరాజుచెఱపట్టుట కేవలము మాయందుఁ దాఁగనుఁ బఱచిన తృణీకారభావమేగాని వేఱొండుగాదు. మొష్టటిముద్ద

గల్లు ముట్టడియందు మీరుపొందిన పరాభవ మింతలోనె మఱచి వెనువెంటనె యింతటి నీచకృత్యములకుఁగడంగుటఁజూడ గుహాను నిద్రఁగూరియున్న నృకేసరినిఁ దట్టిలేపుటయెగదా ? ఈద్రోహ కృత్యమును బునాదిగాఁగొని మీయందారోపింపఁబడిన నేర ములుమూఁడు. సందేశసమాధానములెవ్వియుఁగొనక మారాజ్య మున మీయువరాజుకాలిడినది మొదటితప్పు. ముద్దగల్లు కారా గారకవాటములఁజీల్చి మాబందిగమైన చింత్రాదిరెడ్డినిఁ జే కొన్నది రెండవనేరము. అన్నిటికంటెను నెక్కుడుగ శారదఁ జెఱఁగొని యేగుటమూఁడవయొగ్గు. ఇందులకు పరిహారముగా మీపాలనమందున్న సోఁదూరు, బంకాపురములను మాకువిడు చుట, చింతాద్రిరెడ్డిని శారదను మాకప్పగించుట, ప్రతిసంవత్స రాంతమున మీరాష్ట్రాదాయమందు నాలవవంతుకానుకగాక దోషపరిహారార్థము మీకూతునాగాంబికను మాకిచ్చివివాహ మొనర్చుట. ఈ నిబంధనలకులోఁబడరేని వాసరద్వయంబున రాజ్యమును ముట్టడింతుము. ఇట్లు

ఫిరోజిషాహా

దౌలత్ నగర్. బహమనీసుల్తాన్.

ఇట్లుమాత్యుఁడు సందేశమునుఁజదివిముగించెను. రాయల నేత్రద్వయంబు రక్తరేఖాసమన్వితం బయ్యెను.

విషయమసంగతమైనను యువరాజపవాదమునకు భాగ ధేయుఁడవి సభ్యులుదలఁచినఁ బదవీప్రతిష్ఠలకుఁ గళంకమని భావించి కడుగంభీరభాషణముల యువరాజు నీరీతిఁబ్రశ్నించెను:

కుమారా! పాహోగారంపినసందేశమును సాంతముగా వింటివా? నేరమొనరించితివా?

విషయము కల్పితము. నే నిరపరాధిని.

ఎట్లు?

నామనోవాక్కాయకర్మ లందులకు సాక్షిభూతములు.

ప్రత్యక్షమున నిరూపింపసాధనము?

నడవడి.

వారత్రయంబుక్రింద నీవుముద్దగల్లున కేగియుంటివా?

లేదు. ప్రజోపయోగార్థమై యందందు నీటివసతులఁ గల్గించుచుమాసత్రయంబునుండిరాజధానీనగరమును వీడిపోయిన వాఁడఁగాను.

అయిన పాహోగారకారణముగా నిట్టిసందేశము నేల బుత్తెంచిరి?

దురాశాపాశబద్ధులకు ద్రవ్యాకాంక్ష వోడముకొలఁది మృషలెక్కుడగుట సహజమే! కపటవర్తనుల కన్నియుఁజెల్లును.

నీవనపరాధివని నిరూపింప మఱెద్దియేనినాధారమున్నదా?

సామంతులెఱుంగరా? మంత్రులకుఁదెలియదా? భృత్యులుకానరా. లోకమెఱుంగదా? దైవములేఁడా?

తనయునివినయగర్భితములగు విజ్ఞాపనంబుల సభ్యులకను మూనమొదవలేదని రాయలు గ్రహించెను. కుమారునిఁగూర్చుండ నియమించి సభ్యులఁగాంచి యిట్లు ప్రశ్నించెను.

సామంతనృపులారా! అమాత్యశిరోమణులారా! పురి ఘనులారా! కుమారుని విన్నపములఁగూర్చి మీయభిప్రాయ మెట్లు?

సార్వభౌమా! తుచ్ఛవర్తన మెఱుఁగని సద్గుణమూర్తి. ఇతఁడు సుజనానువర్తియగుట నిరపరాధియని మేము నొక్కి చెప్పఁగలము.

కుమారునిపూర్వవృత్త మెఱుఁగనివారిందెవరు? యువ రాజుదుష్టవర్తనుఁడని యేరువక్కాణింతురు? ఏరికపకారమొన రించెనని ప్రవేలెత్తిచూపఁగలరు? వేయికాగడలువెలిగించిచూచి నను నలుసంతయేనిమలినంబుఁ గాననినిర్మలహృదయునక కారణా పవాదమా? అప్రతిహతపరాక్రమున కిట్టికళంకమా? పుష్పఫల భరితంబగు సుభూజమునకుఁ బురుగురాటునా? నిండుధావళ్య రాశిచేఁజెన్నొందు కలహంసంబునకు మలినవర్ణమా? ఏమిది? ప్రజ్వలితంబగునగ్నికిఁ జదలంటినది! సర్వానందదాయకంబగు నమృతము విషమైనది! కుమారునిమీఱెఱుంగరా? గుణాగుణం బులు పరికింపరా?

సార్వభౌమా! తరుణవయస్కుండైనను శృంగారశిఖామణి మాత్రమేగాక ధీయుతుఁడునగు మనయువరాజునకు సత్యశీలము లందు సాటియేలేరని లోకము వేనోళ్లఁబొగడుచుండ తురుష్కు లకారణనిందారోపణం బొనరించినంతనది కళంకమా? అనిపలికి

సభ్యులు మిన్నకుండిరి. అంత రాయలు సంతసించి యిట్లుపన్యసించిరి.

సభ్యులారా! మీలో నన్నుభూషించుభృత్యులుందురు, దూషించుధూర్తులుందురు. ఆపదలొదవినపు డాత్మలనర్పించు నాప్తులుందురు. వసంతసేనవలె స్వామిద్రోహ మొనర్ప సాహసించు ద్రోహులుందురు. రణరంగముల వైరివర్గమును నుగ్గునూచ మొనరింపగలయోధులుందురు. వైరికివెన్నిచ్చిపాఱుబీరువులుందురు. దేశాభ్యుదయమునకు మార్గమారయఁగలపుణ్యశీలురుందురు. మన్నాశమునకై కుట్రలువన్నున రాచకులుందురు. రక్తాన్నమేజీవనముగాఁగల పరాక్రమశాలురుందురు. సోమరులై పరాన్నపానీయములే పరమపదముగాఁ భావించుతిండిఁబోతులుందురు. రణవిజితులగుపుణ్యమూర్తులకొఱకు వీరస్వర్గద్వారములఁ దెఱచి విమానములతో నంబరతలమునం దమరులుగాచియున్నారు. పాపవర్తనులకొఱకు కాలదండములు కేలనంది కాలకింకరులు నరకద్వారములఁ ద్రోయఁ గాచియున్నారు.

దండనాయకులారా! అపోహంబగుకల్పనఁగల్పించినది గాకసొండూరుబంకాపురదుర్గములను వారికే వదలవలయునఁట! ప్రతివత్సరాంతమునరాష్ట్రాదాయమునందు నాలవంతుఁ కానికయర్పించవలయునఁట! చింతాద్రిరెడ్డిని శారదను వారికినేనొప్పగింపవలయునఁట! అంతియ గాక నాకూతును షాహాకిచ్చి వివాహ మొనర్పవలయునఁట! వింటిరా? ఎట్టి దుహూర్తులు?

ఎంత దురహంకారము ? ఎట్టితృణీకారభావము? హృదయకుహరమునుభేదించు దుష్ప్రలాపములు ?

ప్రవిమలంబగుక్షత్రియ వంశమునజనించినయేను-అఖండ సామ్రాజ్యలక్ష్మీధురంధరుండనై విజయనగర రాజ్యరమను జేపట్టినయేను-పవిత్రవంతమగు హిందూమతమునకువన్నెఁబెట్టిన యేను — మొఘలులబాహ్యాడంబరములకు వెఱచి, సద్గుణవల్లి, సాధ్వీమతల్లియగునస్మత్తనూజను నాగాంబికను తురుష్కుల పాలుగావింతునా?

సేనానులారా! 'హస్తములు గాలినపిమ్మట విస్తరలుఁబట్టిన లాభములేదు' సంఘోపద్రవమొదవక మున్నె మనమేయాజికిఁ దలఁబడుట సమంజసము. కేరళనరసింహరాయా! ముప్పదివేల రక్షకభటులతో నీవీవిజయనగరమునఁ గాపుండుము. ఓరుగల్లు కృష్ణదేవా! నీవిరువది వేలయాశ్వికబలముతోఁ బానుగల్లుఁగాచు చుండుము. ముద్దదండనాయకా! మూఁడువేల సేనలఁగొనిబంకాపురమునుగాపాడుము. గుఃడయామాత్యా! నీవీయువరాజుతో ముద్దగల్లు నేముట్టడింపుము. పనిదేముద్దగల్లునకు రణయాత్రఁబోవుచున్నాఁడ. లెండు. భుజములప్పళింపుఁడు. నడుములఁ గట్టుఁడు. ఖడ్గములఁగొనుఁడు. ఖండింపఁజనుఁడు.'

అంత కేరళనరసింహరాయలిట్లుపలికెను. "సార్వభౌమా! ఆజ్ఞ చొప్పున నేవిజయనగరమునుసఁరక్షించుచుండువాఁడ. ఇతఁడు మదీయసేనాని, నవీనాగంతుఁకుడు. నవమన్మధాకారుఁడు.

గుణరత్నములకు రత్నాకరుఁడు. పరాక్రమనిధి పేరు. శ్యామ సుందరుఁడు. వేటతమకంబునఁ బ్రాణాపాయస్థితినున్న నన్ను సంరక్షించిన దయామయుఁడు. తమతోనరుదేర నువ్విళ్లూరు చున్నాఁడు. ఇతనిఁ దమవెంటఁగొనిచనవలయు'' నని పార్శ్వ వర్తియగు నొకయువకునిఁజూపెను. పరమానందభరితులై రాయ లందులకియ్యకొనిరి. శ్యామసుందరుని సురూపశోభావిశేషము లకు సభ్యులందఱు సంతసించిరి. అందఱు యుద్ధసన్నద్ధులైరి. విజయనగరవాహినీపతియగు సింహాద్రియు కేరళసేనాని యగు శ్యామసుందసుందరుఁడును పరస్పరమిత్రులై సైన్యమునకగ్రే సరులైరి. మహావైభవముతో దేవరాయలు యుద్ధయాత్ర వెడలిరి.

---

## పంచ్రెండవ ప్రకరణము

### చేతికందినకబళము నోటికందదయ్యె

అలనాఁడుదయమున నే జానకినిఁజెఱవిడిననశృంగారభవన మును యువరాజగునహమ్మదుషాహా గాంచఁబోయెను. పాప ము! అరవిందములులేనిసరోవరంబుమాడ్కి హిమధాముఁడు లేనినిశాకాంతవలె పక్షిలేనిపంజరముభాతి జానకిలేనిశూన్యగృహ మును గాంచినతత్క్షణమే వానిగుండియ వకావకలయ్యెను. అది వఱకేశారదా ప్రయత్నమునవిఫలమనోరథుఁడై యుండుటచే నాప్రమోదభవనమున జానకినిఁగాని కావలివారిఁ గానిఁగాంచ నపుడు నానావిధాలోచనంబుల కతినిమానసము దావలమయ్యె

ను. అంతర్భవనములఁ బఱికించియు, హజారములుఁ దిలకించియు, మూలలు శోధించియు, మందిరమంతయుఁ గలయఁ జూచియుఁ బ్రయత్నము విఫలమేయయ్యెను. వికాసమంతరించిన మోముతో మధ్యాంగణమునఁ దూగుటుయ్యలపైఁ గూరుచుండి యిట్లులాలోచింపసాగెను. ఆహా! దైవము ననుసంకటపెట్టఁదలఁచెనేని మార్గము లెన్నిలేవు? సామాన్యలగు స్త్రీలవలలందుఁ ద్రోసి నన్నుడికించుచున్నాఁడు గదా? నాఁడు బాలికాపాఠశాలయందుఁ గాంచిన శారదచిత్రరూపమునకు బెంగఁ గొని తద్వియోగమునఁ గొంతవఱకుఁ గాత్రము లయించె. నేఁడీ జానకిమూలమునఁ దపించుచుంటి. ఏమిది? ఏలికనగు నేను సామాన్యస్త్రీలవలలఁ దగిలి యిట్లు పరితపించుచుంటి. అబ్బా! అమ్మగువ లెట్లు సామాన్యలగుదురు? త్రిలింగాంగన లబలలని, యస్వాతంత్ర్యులని లోకప్రతీతియొకటి మాత్రము ప్రబలినదిగాని యదెక్కడి మాట? వారు సబలలనఁ దనుఁ బట్టఁబోయిన భటాళినదలించి యేగినశారద సాక్షిగాదె? చెఱఁబగిలితప్పినజానకి స్వాతంత్ర్యధురీణయనఁ దార్కాణముగాదె! పుష్పలాజమని శారదనుఁ గని ముందే హసించితిఁగాని యాసంతస మెంతోకాలము నాయందు నిలిచినదికాదు. శారదకై యొనర్చిన ప్రయత్నములు విఫలమగుడు నానాటికినాకావంతసన్నగిలి నిరాశఁ గొని యించుక స్వస్థతఁ గాంచియుంటి. ఏవంకనుండి వెదఁ జల్లెనో సూనరాజములకు రాజరాజువోలె జానకీసుమరాజసౌరభము. నన్నాశ్రయించి పరిపరితెఱగులఁ బాధించెడి. కట్టా! చేతికందినకబళము నోటికందదయ్యె! చెఱఁ గొని, రమ్యహార్మ్యంబుఁ జేర్చి, సాంగ

త్యమునకు సమాధానమువేడనెంచిన యీనాఁడే కావలివారి కంటమన్నుఁగొట్టి యందఱికన్నులుమూసి మాయమైన జానకి టక్కరితనము శ్లాఘింపఁదగినదిగదా? ఆమెనుగూర్చి నాయందం కురించిన యనురాగలత యగాధముగ పుష్పఫలభరితమై వికసింప నేనేమి యొనర్చుటకును సాహసింపకుంటిఁగాని, ఆలతాబంధమే నను బాధింపకుండినఁ గటికకారాగారమున శృంఖలాబంధితునిఁ జేసి జీవితకాలమంతయు శోకింపఁజేయకుండునా? వేళ మిగిలి పోయె! చేయునదేమి? ప్రజలఁబాలించు నిరంకుశాధికారమును నాకొసంగిన దేవుఁడు, నామానసమును స్త్రీలవలయందుఁద్రోయ కుండినచో నెంతో బాగుపడువాఁడనుగదా! నేనార్జించిన గౌరవమీస్త్రీలమూలమున నేటిపాలయ్యెనని యహమ్మదు చింతిలుచుండెను. ఇంతలో ఖాజీ యందులకరుదెంచెను. వలసిన విషయము లడిగి దెలియఁదగునని యువరాజాలోచించెనుగాని ఏదియోవిషయము మానసమునకుఁదట్ట నధోవదనుఁడై యతఁడు చింతిలుచుండెను.

షాహాకంటెను ముందుగనే యరుదెంచి విలాసమందిర మందలి విషయవైపరీత్యమునెఱింగినఖాజీ నిజస్థితినారయ రంగ మహాలునకేగియుండెను. అందు కావలివారిచే రాత్రినడచిన వృత్తాంతమును గొంతవఱకుఁదెలిసి వెంటనే యహమ్మదుషా హాను దిలకింప నంతిపురమునకేగెను. యువరాజందులేనివార్తఁ దెలిసి రక్షకభటులతో వెఱల నీప్రమోదభవనమునకే యరు దెంచెను, అరుదెంచిన ఖాజీనిఁగాంచిషాహా యేమనినైనఁబల్క

రింపక యిన్నకుండెను. అతని యభిప్రాయమును గుర్తెఱింగిన ఖాజీ యిట్లు సంభాషింప మొదలిడెను.

షాహాగారిచింతకుఁగారణము జానకిపోకడ యనిదలఁచు చున్నాను.

సాధూ యదిదెలియక తహాతహా నొందుమానసమున కేదేని మందొసఁగెదరా? మీకై నిరీక్షించియుంటి. విషయ వైపరీత్య మతిచిత్రముగానున్నది.

తెలిసినంతవఱకే యాలోచించుటలో నంతిపురిరక్షక భటులు మోసపోయిరి. ద్వారరక్షకులు గాసికిఁ బాలొసఁగిరి.

గాసియుమోసమునొదవఁ గారణమే లేదుగదా?

శత్రువే ఖొజ్జావేషమున మీ వ్రేలిముద్రనొసఁగి కావలి వారిఁ గనులుమూసి జానకినిఁగొనిచనినట్లు తేటపడుచున్నది. పోవువారూరకఁబోవక పురిరక్షకభటులలో నొకనిఁ గత్తికెరఁ జేసినారు. మఱియొకనినోట గుడ్డలు గుక్కినారు. ఎటకేగిరో? మాయమైనారు.

నాయంగుళి వైరికెట్లు లభింపఁగలదు?

అది నేనెట్లు చెప్పఁగలను? మీకెఱుక! దానిహరించిన యా మాయఖొజ్జాకెఱుక!

ఏదీ! యాయుంగర మిటుఁదెండు.

రంగమహాలునకు రాత్రికావలికరిగిన రక్షకభటుల కాన వాలుగా నొసఁగిన ముద్దుటుంగరమును, ఖాజీ షాహాకందిచ్చెను.

యువరాజు దానిఁబరికించి పరికించి యుస్సురని గొప్పనిట్టూర్పు పుచ్చెను. అది తనదగుటఁదెలిసి హాహా యిట్లనెను.

ఇది నాయంగుళీయకమే. సాముద్రికలక్షణమందలిసత్యా సత్యములుఁ బరీక్షింప నేగూఢచారినై యేగిననాఁ డిదినాచే వీడినది. అపుడే భటులనారయఁబంచితి. వారు తమకు లభింపఁ లేదని మృషలాడిరి. నిక్కువముగా నిదివారిచేఁ జిక్కినది. చిక్కినదానినట్లే దాచియుంచి సమయమును నిరీక్షించుచుండి జానకిచే లంచమునుఁగొని విడిచిపుచ్చిరి. దీనిమూలముననే వార పరాధులుకారని నిరూపించుచున్నారు.

తామిట్లాలోచించితిరి. నాకు మఱియొకసందియ మొదవి నది.

మీసందియమెట్లు?

మీరు గూఢవృత్తిని సాముద్రికమును బరిశీలింపఁబోయి నపుడు ఆశాస్త్రవేత్తకే యిది లభించియుండును. ఆజ్యోస్యుఁ డొకవేళ జానకికాప్తుడుగా నుండియుండును. అతండే క్రొజ్జావేష ధారియై కావలివారినేమరించి జానకినిఁగొని చనియుండు . నాకీయూహ పొడముచున్నది. సత్యాసత్యములు నిరూపింప కయే కావలివారిపై నేరమారోపించుటకు మానసమించుకవెను దిరుగుచున్నది.

సాముద్రికశాస్త్రవేత్త నాచేననుజ్ఞఁగొనియేగి మూఁడు దినములైనవి. ఊరలేనివానిపై నేరారోపణమొనర్చుట కేవల మసంగతము.

మీరట్లు దృఢపడియుండిన నావిషయ మింకను విచారణీయమే. భావిపరిశోధనవలనఁగాని న్యాయాన్యాయములు తేటపడవు. ఎట్లో కొంతకాలము శోధనమావశ్యకము.

నాప్రయత్నములన్నియు నదియూడిపోయె నిదిజారిపోయె నని చేతులుఁజోడించుకొని యూరకుండవలసిన వాఁడనేగదా ?

తామిట్లాగ్రహించిన కార్యముచెడుటయగాక, ఫిరోజిషాహాగారికి స్వల్పవిషయముచెవిఁబడినను మీవిషయమున నను మానమునను మీరె చోడిడినవారగుదురు.

అయిన నీవిషయమందు ముందోనర్పనెంచిన ప్రయత్నమేది ?

ప్రకృతమున నే నేపనియుఁ దలపెట్టుకొనలేను. ఆతురపడిన కార్యభంగమొదవునని యాలోచనము పొడముచున్నది. ఆత్రగానికి బుద్ధిమట్టంబను లోకోక్తి వినరా?

మీరిట్లు నుడువుచున్నారు. నేనాయాంధ్రవనితలందలి వ్యామోహమును భరింపఁజాలకున్నాను. మఱి నదుపాయమెద్ది?

తామిట్లు కేవలము మోహవికారమునకుసందొదగిననేనే మనఁగలను ? వేళననుసరించి ధైర్యమొందుటయే వివేకవంతులకువిధి. ప్రకృతమున నేనాచరించు పనులెన్నియో గలవు. సుల్తానుగారు నారాకకొఱకు వేచియుందురు. నేఁడే విజయనగరపురాజులపై దాడివెడలుట కేర్పడినదినముఁగూడను. సర్వసన్నాహము లపుడే సిద్ధమైనవి. నేనందుల కేగవలయును.

కార్చిచ్చుదరికొన్న యరణ్యమునఁబడి పరితపించెడు మృగమువోలె నాంధ్రజవ్వనులమరులునకెరయైన నాతాపమార్పఁ

దగుచికిత్సఁజేయకున్న నేఁబ్రతుకనోప. మీఁదు మీయిష్టము.

మీసౌందర్యమును వేఁగన్నులఁగప్పికొనునంతఃపురమహా మ్మదీయ సుందరీమణులెందఱోయుండ హిందూమతమందే కేవలము తక్కువగాఁజూడఁబడు శూద్రజాతివనితలకై యిట్లు వందురుట కేవలము శోచనీయమని నిర్భయముగాఁ జెప్పినందులకు మన్నింపఁబ్రార్థితులు.

వీరిట్లు సంభాషించుచుండిరి. ఫిరోజిషాగారిమొదలమైనదని యొక యధికారియరుదెంచి ఖాజీయహమ్మదులకు నివేదించెను. ఇర్వురు నాచోటువిడచి షాహా యాస్థానమును సమీపించిరి. వారిఁగాంచి గంభీరభాషణములతో షాహా యిట్లనెను.

అహమ్మద్, విజయనగరముపై దాడివెడలుటకు నేఁడే గడువుదిన మేర్పడియున్నది. బీదరు బిజాపూరునుండియు, బీరారు గోలకొండనుండియు, సేనలాయత్తముగావచ్చి చేరినవి. అహమ్మదునగరపుసేన యేలకో రాఁదడవైనది. కూడినసేనల కంతయు నీవే నాయకుండవై కృష్ణానదిని సమీపింపుము. అహమ్మదునగరమునుండి సేనలరుదెంచినవెంటనే దుర్గరక్షణము లకు తగువసతులనుగూర్చి, రేపో యెల్లుండియో ఏసందుల కరుదెంచువాఁడ. వజీరుఁడుగూడను నీజంటనే యరుదెంచు. పోయిరమ్ము.

ఫిరోజషాహాయాజ్ఞ కఠినమైనది. సుగ్రీవాజ్ఞయయిన దాటనగునుగాని షాహానోటినుండి వెడలినమాటకు మారులేదు. పాపము! జానకీ విషయాలోచనంబులఁదనివిదీరక చింతిలుచుం

డిన యహమ్మదుషాహా మాఱాడక కదనభూమికరుగవలసిన వాఁడయ్యెను. షాహాయాజ్ఞ చొప్పున సేనలనడిపించుకొని కృష్ణా తరంగిణికి సమీపమందు దండువీడి వైరిరాక నారయుచుండెను.



## పదుమూఁడవ ప్రకరణము

### రణరంగము

ఆంధ్రప్రభువులును మొఘలు సుల్తానులును గత్తిఁగట్టి పోరొనర్చుచుండిన వీరవిహారప్రదేశములు కృష్ణాతరంగిణికి దక్షిణోత్తరపుటొడ్డులు. వాహినికిరుపార్శ్వముల నుభయసేనలును ఘోరముగాఁ బోరుచుండెను. ఏవంకఁజూచినను పర్వతములు వోలె భద్రగజములుగూలి ప్రాణములువోక విలవిలఁదన్నుకొనుచుండెను. ఏదిశఁబరికించినను ఊరుస్కంధములవఱకు సమూలముగాఁదెగిన జవనాశ్వములు కుప్పలుగుప్పలుగాఁగూలి రుధిరప్రవాహమందుఁ బొర్లాడుచుండెను. ఏచక్కిఁగాంచినను ఖండెతుండెములుగాఁదెగి ప్రాణములఁగోల్పోయిన వీరభటులు ప్రవాహమున నదీమార్గమనుసరించి యేగుచుండిరి. నిర్మలవారివాహిని యని ప్రసిద్ధనామంబునఁ బెంపారిన కృష్ణాతరంగిణి, శవరక్తమున మిళితమై స్వకీయనామమునువీడి శోణయను మాఱుపేరందినదేమో యననొప్పుచుండెను. శవామిషాపేక్షకంబులగు కంకగృధ్రాదులు హరించిన మాంసశకలంబులతో దృక్పథంబున కెగసి వలయములుగట్టి దిరుగుచుండెను. ఇట్లే దినములుగడచుచుండెను. వారములు దాఁటుచుండెను. నెలలంతరించుచుండెను.

ఇట్టి దారుణంబగు ప్రవిదారణమునఁ దనసేనం బ్రవేశించి భీమార్జునులోయన వీరవిహారముసలుపుచు యవనసైన్యమును జెండాడుచున్న సదాశివానందరాయ లెవరైయుందురాయని దేవరాయలు నిబ్బరంబగునబ్బురంబందిరి. కాని యది యన్వేష మునకదనుకాదు గనుక మిన్నకుండిరి. పోరు ముగియలేదు. దినదినాభివృద్ధినిఁ గనుచుండెను. ఇరుసేనలందును రణోత్సాహ మతిశయింప బ్రస్థానభేరీకాహళధ్వనులు మిన్నంటిపోవుచుండెను. కదనభూమినుండి నిగూఢముగా ప్రేలెడిపిరంగీనినాదంబులు దిగం తములఁ బధిరీకృతము గావించుచుండెను. గగనవీధికెగసి సేనా మధ్యంబునఁబడిన నాయగ్నిగోళములించుకతామసించి ప్రేలు టచే చుట్టుమూఁగిన మొఘలుసేనలు పటాపంచలై జమునదన మున కతిథులగుచుండిరి. పెనురోషంబున రణవిజయాభిలాషులై యమోఘమగులోహగోళములను బ్రయోగించుటచేఁ జంటలు జంటలుగానేతెంచి గభీలునఁదాగు నా యుక్కుగుండ్లధాకలకుఁ దాళఁజాలక యాంధ్రసేనలు శవపురి కరుగుచుండిరి.

శరపరంపరలసన్నగిల్లెడు తనసేనఁగాంచి జగదేకవీరుఁ డగు దేవరాయలుకాలాగ్నిరుద్రుఁడోయనఁ గ్రోధానలకీలలు భ్రూమధ్యమునఁదాండవింప విజయోగ్రమూర్తియై కృష్ణను దాటఁ దనవాహినీపతులఁ దీవరించెను. గడవరానిదగు తమ ప్రభునానతినిఁదలనిడి కష్టప్రయాసమున నదినిఁదాటి, భయం కరాట్టహాసములతో వైరులను సమీపించిరి. మహమ్మదీయ సేనయందలి యోధవీరులమోములందు వీరరసముట్టిపడ నెదు రొడ్డికసిమసంగుచు వైరిబలముల వెనుదట్టుచుండిరి. ఆంధ్రసేన

యందలి మేటినాయకులు మొఘలువాహినియందలి తమసరి వీరులతోఁ బోరాడఁగడంగిరి. గోలకొండసుల్తానుతో గుండయ మంత్రిదలపడెను. బిజాపురవునవాబును, ముద్దదండనాయకుఁ డెదిరించెను. ఖాజీవజీరుల రక్షకత్వమున కొడిఁగట్టిన యహమ్మదుషాహాపై శ్యామసుందరానందరాయల నిద్దఱినంగరక్షగాఁ గొన్న సింహాద్రి యమోఘముగ, బాణవర్షమును గురిపించుచుండెను. బీదరు బీరారుసుల్తానుల నాత్మరక్షగాఁగొని భద్ర దంతావళముపై వెలసిన ఫిరోజిషాహాను, సదాశివహరిహర రాయల పార్శ్వరక్షకులుగాఁగొన్న దేవరాయసార్వభౌము లెదురుఁదాకిరి. ఇరువాఁగులందలి మేటినాయకులు రణలీలా వినోదులై గదాప్రహారంబులఁ దనువులపై రుధిరధారలు వెల్లువలై పార, గంభీరభావస్ఫూర్జితంబులగు ప్రగల్భవాక్యంబులు వలుకుచు మానక యొకరినొకరు దాకుచుండిరి. ఊరువులఁదట్టి, భుజములప్పళించుచు మీసములఁబురికొల్పి, తమతమ మల్లయుద్ధనైపుణ్యమును గనఁబఱచుచుఁ దుదకు హతులగుచుండిరి. కైజారులుజేఁకొన్న వీరభటులు తమయసిధారాకౌశలమును శత్రువులయంగాంగములపైఁబఱపుచు, నరుకుడుపడ్డగాత్రములతో వీరశయనమందుచుండిరి. అలుగులు దగిలించిన ధనువుల నాకర్ణాంతముగాసీడ్చి వదలిరశరపరంపరలకు ఫాలభాగములు బ్రద్దలుగాఁ దమతురగములప్రక్కఁబడి మూర్ఛాగతులయిన కాంతుల కిరువాగులందును లెక్కలేకుండెను. ఆంధ్రయోధుల నుండి వీడఁబడిన యర్ధచంద్రపాణములు తమశిరంబులఁబలిగాఁ గొనుటకుమున్నె లక్ష్యముండివీడిన మొఘలుల శరాసనకీలల

కోర్వలేక యాంధ్రవాహిని బలుచవాఱుచుండెను. ఉభయపక్షములవారును సమముగాఁబోరుచుండిరి. శత్రుమారణోత్సాహవిజృంభితుఁడై కసిదీర మొఘులుల మెసవిమెసవి దేవరాయలించుక విశ్రాంతిఁగొను సమయముగా నుండెను. తటియెఱిఁగి ఫిరోజిషాహా, దారుణబాణమొండు లక్ష్యముంచి రాయలనెదగాఢ నేసెను. పార్శ్వరక్షకులుగాని దేవరాయలుగాని దానిపై లక్ష్యముంచకపోవుటచే నది యతనిహృదయకుహరమును భేదించి పట్టపేనుంగుపై నొరుఁగఁజేసెను. రాయలుచచ్చెఁ జచ్చెనను మొఘులుల విజయధ్వనులు వినువీధి నతిక్రమించెను. ఆంధ్రసేనల యాహాకారంబు లతిశయించెను.

దవ్వున నహమ్మదుషాహాతోఁ బోరుచుండలపడియుండిన శ్యామసుందరుఁ డీయవస్థమునుగాంచి తక్షణము తేజినినుడాయింపించుకొని ఫిరోజిషాహా ప్రత్యక్షమున కేగి మెఱపుమెఱసినట్లు క్రోధానలకీలాకరాళవదనుఁడై తీక్ష్ణనారాచంబు కేలనంది షాహాకంఠమున లక్ష్యముంచి విడిచెను. అబ్బాణపాతమునకు భద్రదంతి ముందఱికి వ్రగ్గకుండినచో సుల్తాను జముసదనమున కెప్పుడో యతిథియైయుండును గురిఁదప్పిన యాతీవ్రబాణము షాహా దక్షిణకరాబ్జమునఁ గొప్పగాయమొనర్చెను. సుల్తాను కరిపై నొరుగుటనుగాంచి శ్యామసుందరుఁ డాచోటువీడి తన తేజిని చకఁజక నడపించుచు శీఘ్రగమనమున రాయలనుసమీపించి, దంతిపై కెగఁబ్రాకి, రాయలనాడి బరీక్షించి, యుచ్ఛ్వాసనిశ్వాసముల దారిఁదెలసి, ప్రాణభయంబులేమికి సంతసించి తగు శుశ్రూషల నాదరించుచుండెను. శ్యామసుందరుఁడు ఫిరోజి

సాహసునుఁదాకఁబోయిన సంచుఁగని యానందరాయసింహాద్రులు ఆకొన్నసింహములవలె మట్టుమీరి యుట్టిపడుచు నతిదారుణ బాణంబుల నహమ్మదుషాహను మూర్ఛనొందించిరి.

అనంతసేనాపరివృత్తుఁడై, యాహవరంగమునఁ దనశర నైపుణ్యమునుజూపిన గుండయమంత్రియట్టహాసమున కెదురు నిల్వలేక గోలకొండనవాబు రణోర్వినుండి విముఖుఁడయ్యెను.

రణాగ్రగణ్యుఁడని పేరుగాంచిన ముద్దదండనాయకుని నిశితశరాసారపరంపరలకోడి బిజాపురపుసుల్తాను ఆజిరంగమును దొలఁగి పలాయితుఁడయ్యెను. విజయమూర్తులై యందఱును రాయలను సమీపించిరి. రాయలకింకను మూర్ఛవీడియుఁడ లేదు. అందఱును శుశ్రూషలొనర్చుచుండిరి. తరంగిణికి దక్షిణపుటొడ్డున బటకుటీరములందు ధగధగాయమానంబుగా నగ్ని జ్వాలలు దృక్పథమునకుఁ దోచుచుండెను. నభోమండలమంతయు ధూమరాజిచేఁ గప్పఁబడెను. వైరులు, శిబిరములందుఁజొచ్చి కాల్చుచున్నారని సేనయంతయు నల్లకల్లోలమయ్యెను. రాయల శుశ్రూషయందున్న యానందరాయ శ్యామసుందరులును, తమ తురంగములనెక్కి హుటాహుటినడకల శిబిరముల చెంతకరిగిరి. అచ్చట జరుగనున్న యనర్థమును గన్నులారఁగాంచి, యత్యాతురమున నిట్లనిరి.

పతివ్రతాశిరోమణులారా! ఆఁగుడాఁగుఁడు! మీరొనర్ప నెంచినదారుణప్రయత్న మతిభయంకరమైనది. దేవరాయ సార్వభౌములు సజీవులై యున్నారు. మీగాత్రముల నగ్నికర్పించుట యనుచితము అనుచితము! మనకు విజయమొనగూడనున్నది.

మీరీ ఘోరప్రయత్నముడుగుఁడు. అని కడుగంభీరముగా ఘోషించిరి.

గుండమున నగ్ని మండుచుండెను. సమిధలు ప్రేలుచిటచిట ధ్వనులు కర్ణములఁదూటాడుచుండెను. అపుడపుడే కృష్ణానదిని సంకల్పవిధానముగా శిరస్నానమొనర్చిన సుమంగళులుఁగొందఱు స్వాహావల్లభుని సమీపించియుండిరి. శుద్ధోదకములచేఁదడిసిన వారి కేశకలాపములు వీపులపై వీడ్వడి వ్రేలాడుచుండెను. ధారలుఁ గట్టిజారునీటిసోనలు ఆవినీలకుంతలములనుండి ముత్యములువోలె బిందురూపముఁదాల్చి, శివజటాజూటమునుండి వెలువడినగంగనుజ్ఞప్తికిందెచ్చుచుండెను. వారందఱులలాటఫలకములరక్తాంగ లేపనమలమియుండిరి. రక్తవర్ణసుమములు కంఠసీమలఁబేరులు పేరులుగా హారములు దీరియుండెను. రక్తగంధాక్షతలఁ దహనునిఁబూజించినవెంటనే పతిప్రాణలగునాయన్నులమిన్నలు, కరములుముకుళించి కనులమూసి తపనధ్యాన మొనర్చుచుండిరి. ఇట్టితరుణమందే యానందరాయశ్యామసుందరులనుండి వెలువడిన యమృతవాక్కులను విని కనులఁదెఱచియిట్లనిరి.

దురాత్ములగునరాతివీరులపాపము పండెనని వహ్నిదేవున కాత్మలర్పింపఁదలఁచినయగతికులగునంగనలకుఁ గతిఁజూపనెంచిన దీనమందారులు స్వయూధయోధులా? లేక దుష్క్రియాపరతంత్రులై మముమోసఁబుచ్చనెంచిన మొఘలువాహినియందలి కృత్రిమనాయకులా? అనికొందఱనిరి.

అబలలగుసంతిపురికాంతల కభయమొసఁగిన సబలులు, విజయనగరపురాణువనందలి వీరనాయకులా? తురుష్కులా? అని మఱికొందఱనిరి.

పతియే దైవముగా భావించు నసహాయలగుకులాంగ నలకు నిజమును నిరూపింప నేదేని యాధారమున్నఁ జూపి పుణ్య మాపాదించవలెను. కాదేని మీ రాడిన వాక్యములు సత్యమని యీ క్షత్రియాంగనలు విశ్వసించువారు కారు. మేమొనర్పఁ బూనిన ప్రయత్నమును మాని మా నిశ్చితమును విడుతుమని మీ కలయం దైన నెంచకుఁ డని యింక నుఁ గొందఱు వీరాంగనలు సధైర్యముగాఁ బలికిరి.

ఈప్రశ్నలకు త్తరములిచ్చునంతటి వ్యవధి శ్యామసుందరు నకుఁ దొరకలేదు. ఆజిరంగమున రాయలపుడపుడే మూర్ఛ దేరనుండెను. నడుమ నీ దారుణాపాయము సంభవించుటచే విధి లేక వీరి చెంతకరుదెంచెను. వీరచట తమ నిశ్చితమును ఖచిత ముగాఁ జాటి చెప్పిరి. సరియైన సమాధానమొసఁగుటకుఁ దగిన యాధారమెద్దియు నతనికిఁ దోచలేదు. ఏమి చేయఁగలఁడు? వారికి నిజమును నిరూపించి తపనముఖమునుండి విముఖులను జేయు భార మానంపి రాయలపై నిడి రాయల చెంతకు వెడలిపోయెను.

ఇపుడు రాయలకు మూర్ఛ వీడియుండె. వారు గుండ యమంత్రి, ముద్దదండనాయకులతో కదన విషయములఁ జర్చించు చుండిరి. శ్యామసుందరుఁ డందుల కేగి పట్టమహిషి యొక్కయు నంతఃపురాంగనలయొక్కయు, ననర్థప్రయత్నముల నివేదించెను. వెనువెంటనె మేటి నాయకులతో రాయలగ్నిగుండము చెంతకరు గుటయావశ్యకమని ప్రార్థించెను. రాయలకింకను సరియైన శక్తి యొదవియుండలేదు. కాని శ్యామసుందరుని ప్రార్థనమును ద్రోయఁ

జాలక మంత్రిసేనానుల సహాయమున నంమండి కదలిపోయి యావీరాంగనలఁ గావఁగల్గిరి.

ఈ వీరాంగనల యందొక్కర్తుక పట్టమహిషియైయుం డెను. తక్కినక్షత్రియకాంతలు విజయనగరపుమేటినాయకుల వీరపత్నులు. ఆజిరంగమున రాయలుసచ్చిరనువార్త వినఁలఁ బడినవెంటనే తమపతులుగూడను శత్రువులతోఁగసిమసఁగి వీర మరణమొందిరనినిశ్చయించినవారలగుట పట్టమహిషితోఁబాటు దామును నగ్నిఁజొరఁ దెగించిరి. రాయలను, నాయకులను, ప్రత్యక్షమునఁగాంచినవెంటనే వా రానందసాగరమగ్నులై తమ క్రూరకృత్యమును ద్యజించిరి. ఆంధ్రసేనాచమూధాటికి నిల్వలేక మొఘులువాహిని పటాపంచలై పారినదని దృఢముగా నమ్మిన శ్యామసుందరుఁడు, కకావికలైనసేనలన్నిటినిఁగూర్చుకొని విజ యనగరమునుజేరఁబోవునదిగా, రణవిద్యాపారీణుఁడగుసింహాద్రి నెచ్చరించి తానింకనునాజిరంగమునుగలయఁ జూచిపోవువాఁడై యించుక తామసించెను. శిబిరమునులేపి సింహాద్రి రాయ లతో విజయనగరాభిముఖుండై వెడలిపోయెను.

ఒంటరియై యుద్ధభూమినంతయు నారయుచుండినశ్యామ సుందరుని శవములమఱుగునఁ దాగిపొంచియుండినఖాజీవజీరులు, హఠాత్తుగా పైఁబడి చెఱవట్టిరి. అసహాయుండగుటయెగాక కర వాలముకూడ శత్రువశమగుటఁజేయునదిలేక వైరివర్గముఁజేరి శ్యామసుందరుఁడు దౌలతాబాదునకు వలసవోయెను.

ఆహా ! తానొకటిదలఁచిన దైవమొకటిదలఁచునుగదా?

---

## పదునాల్గవ ప్రకరణము.

### ఖాజీచెఱ

కడచినకదనమందు శ్యామసుందర సింహాద్రులు సింహవిక్రములై విజృంభించుటచేతను, గుండయమంత్రిముద్దదండనాయకులయమితవిక్రమమున కాఁగఁజాలకయు, గాయపడి వెనుదిరిగిన ఫిరోజిషాహాతోడి పలాయితులైనమొఘలులతోడనే వైరమడుగంటెనని రాయలు సంతసిల్లిరిగాని, ఖాజీవజీరులు శ్యామసుందరునిఁ జెఱపెట్టిరనువిషమవార్త వీనులకందినవెంటనే వారిసంతోషమంతయు క్రోధరూపమును దాల్చి మొఘలువాహిని నప్పుడే పూర్ణాహుతిఁగొన నిశ్చయించిరి. దీర్ఘవైరమును, ప్రజాక్షయమును, ధనవ్యయమును, లోకకంటకములనియు—సామము సర్వకార్యసాఫల్యమునకుమార్గదర్శకమనియు—మఱిమఱి సవినయముగా విన్నవించిన సదాశివరాయలప్రార్థనఁ ద్రోయఁజాలక దేవరాయలు కొంతవఱకెట్లో కాలమును వెళ్లఁబుచ్చుచుండిరి.

“ఖాజీని, అహమ్మదుషాహాను యుద్ధభూమియందుఁబరిమార్తును. రాయలచే ననుపఁబడినగూఢచారులు నాశారదఁదెత్తురు. విజయశీలుఁడగుటచే రాయలు నాశారదను కానుకగా నాకిత్తురు. అపుడాయన్నులమిన్నఁగూడి చిరానందసుఖమనుభవింతు”నని కొండంతయాసతోనువ్విళులూరుచుండిన సింహాద్రి, పోరుముగియమికి వికలమానసుఁడై సదా చింతిలుచుండెను.

“నిజమగునంగనాస్వరూపమునుగప్పిపుచ్చి సరసిచెంత నన్యాపదేశమున తనివిఁజెందించి యేగినమాయామోహినిజాడ

మఱలగానక, యమ్మగువనుదర్శించునవధి యెప్పుడౌదవు'' నని యాతురుఁడై యువరాజగుహరిహరుఁ డే కారుచుండెను.

చేదోఁడువాదోడులందు కుడిభుజమైచరించుచుండినశ్యామసుందరుఁడు మొఘలులచెఱయందుఁ జిక్కినదుర్వార్తవిన్నదాది యాతరుణుని విడిపించుటకు వెరవెద్ది యనివిచారించుచు, వేగులఁబంచి విజయనగరాధీశ్వరులనుండియుత్తర ప్రత్యుత్తరములుఁబడయుచు, కేరళనరసింహరాయలు కార్యశేఖరమునకుఁ జాడలారయుచుండెను.

''తన్నుఁజేరవచ్చిన సదాశివానందరాయలచేఁ గడచిన వార్తలన్నిటినివిని మొఘలుల దుఁడగములనుండి విముక్తిఁగని, తనరాజ్యమెటుల సుఖముగాఁగాపాడఁగల్గుదు'' నని దీర్ఘాలోచనమునఁ జిక్కి యోరుగంటిప్రముఖుఁడు స్రుక్కుచుండెను.

విషయములన్నియు వరియును బెరుగునుగలిపినరీతినందఱి నన్నివిధముల వివిధాలోచనంబులఁ ద్రోసియుండెను.

విజయనగరమునందొకనాఁడు పౌరులందఱునిద్రాసక్తులై యుండిరి. అర్ధరాత్రముమీఱియుండెను. ''ఒక్కడేరో దేవుఁ'' డనునట్లు మూఁడవఝామునంత్యమును నిరూపింప కుక్కుటవ్రాతము క్కొక్కొరకోయని కూయుచుండెను. అవునవునని ప్రత్యుత్తరములొసఁగుచున్నవోయన సారమేయారావములుప్రబలిచద లంటుచుండెను. నిరంకుశాధికారము వహించి మోరలఁబైకెత్తికొన నొకేరీతి తమయుల్లాసమును వెలిబుచ్చుగార్దభముల కఠోరనాదములు దిశల ప్రతిధ్వను లీనుచుండెను. అనల్పకా

మునసే యీరావఘోరవములాగి జగమంతయు నిశ్శబ్దమయ్యెను. ప్రత్యూషపవనాంకురములచలనముచే నుదయించిన మంద్రస్వన ములుదప్ప వేఱుధ్వనులెవ్వియు వినుపించుటలేదు. దివాంగన యేతెంచిన నీసౌరుసన్న గిలునని, నిశాంగనకు వార్తఁజెప్పనేతెం చిన దూతయోయన పూర్వదిగ్భాగంబున వేగుచుక్క వెలలు చుండెను. అపుడుగూఢవేషధారియగు గుండయమంత్రి యిర్వురు భృత్యులతో పురిమర్మములారయ విజయనగరిపుసందుఁ గొందులఁ బచారుచేయుచుండెను. అందంద గస్తుదిరిగి వారు, పురిబాహ్యప్రదేశమునకరుదెంచిరి. ఆబహిరాంగణమున రాయ లచే నిర్మితమైన విశాలయుతమగు సత్రమొండుగలదు. సత్ర మునకు ముంగిలివసారాయందు నిర్వురుపథికు లపుడపుడే నిద్ర మేల్కాని యేమియో సంభాషించుకొనుచుండిరి. నిగూఢవృత్తి నున్న భృత్యులకుఁగాని, యమాత్యునకుఁగాని వారియాకారము లిట్టివనిగోచరింపలేదు. కొంతవఱ కాసంభాషణ మాలకించిన గుండయమంత్రి, చారులనుమెల్లనఁజేరబిల్చి నిశ్శబ్దముగానుండి వారిసంభాషణమాలింపుఁడని హెచ్చరించెను. అధ్వగులసంభా షణము నీక్రిందవిధమున నాముప్వురాలించిరి.

ప్రథ—మనకును ఆంధ్రరాజులకును కదనమెట్టివేళఁదట స్థించినదోగాని జననష్టమునకును, ధనవ్యయమునకును, విధివిరా మమే లేకున్నది. మనకర్మమెట్టిదోగాని నిరంతమిట్టి కష్టములే యనుభవించుచున్నారము.

ద్వితీ..అవునవును. షాహాదేహాస్థితి స్వస్థముగానుండినచో మనకిన్నియిక్కట్టులొదవకుండు,రాచకార్యములందునహమ్మదు

షాహా స్వతంత్రుఁడగుటయే మనసుఖముల కిట్టి యంతరాయములు సంఘటించె.

నాటికదనమున శ్యామసుందరుని చాకచక్యమెంతఁగొని యాడినను తనివిదీరకున్నది. వాఁడు ప్రయోగించినబాణపాతముచేఁ బొడమినగాయ మెన్నటికినిమానక షాహాను కడుబల హీనునిగ నొనర్చినది. అతఁడే స్వస్థతగాంచిన విజయనగరపు రాజుల రూపుమాపకవిడుచునా ?

అవ్విషయమున నహమ్మదుషాహాగూడను శ్రద్ధవీడ కున్నాఁడు గదా ? లోప మేమున్నది ?

లోపముమాట యటుండనిమ్ము. మనకీయిబ్బంది వీడదు గదా ?

అది యిపుడెట్లు వీడును ? కదనమంతముకావలయు. మనకష్టములు దీరవలయు. ఆయాలోచనంబిపుడేలకాని, సేన చెప్పిన గుర్తులననుసరించి పురినంతయునారసితిమి. లలితమందిర మెందున్నదో గానము గదా ?

అదిదెలిసియుండిన మనప్రయత్న మీపాటికే ఫలించి యుండును. చాలతాబాదునకా శుభవార్త నేఁడే యందించి యుందుము.

నగరము కడుగొప్పదగుట వీడివవీధులు లెక్కకు రాకున్నవి. ఏమైననుసరే. నేఁడ రాజవీధినిఁబరికించి వసంతసేన సూచిం

చిన గుర్తులఁదిలకించితిమేని లలితమందిరము గాంచగలమను నమ్మకము కలుగుచున్నది. లెమ్ము. నేఁడీ ఘోషాయిరూపముల మఱుగువఱచి, యాచకులయాకారమూనియేగుదము. రమ్ము.

ఈ సంభాషణమును సాంతముగా నాలకించిన గుండయ మంత్రి వారితో నిట్లనెను. ఎవరుమీరు? శత్రుపక్షములోని వారివలె మీసంభాషణమునఁ దేటపడినది.

అన్నా! దారిబోకులు వైరివర్గములోని వారగుదురా?

కారు. మీరు నిజముగాఁ బగవారలే. చారులారా? వీరిని శోధించి చెఱగొనుఁడు. అని మంత్రి యాతావు వీడి పోయెను. భృత్యులు శోధింప మొదలిడిరి. మొదటివాఁడు మాటలసందడిని మఱుగయ్యెను. కనుమఱగిన యాయధ్వగుని జాడఁగన రాజభటుఁ డొకఁడు వెనుదగిలెను. వెనుదగిలిన భృత్యుఁడు కొంతదవ్వేగెనుగాని వైరి సందుగొందులఁబడి నెందుతసికెనో దోచలేమ. చావడిచెంత భృత్యుఁ డొక్కఁడే యగుటచేఁ జిక్కినశత్రువుగూడను పలాయితుఁడైన ప్రమాద మొదవునవి యాభటుఁడు వెనుదిరిగెను. ఇర్వురుఁ జేజిక్కిన యాగోషాయిని రజ్జుబంధితునిఁ జేసిరి. సేవకునిరాకడ యాగిపోవుటచే ప్రథముఁడు నిఁకఁదనుఁ బట్టసాధ్యముకాదని ధైర్యమూని స్వేచ్ఛావర్తనుఁడై పరుగిడసాగెను. ఆతరుణమున దిశాంగనలు దెలివొందెనన గాఢముగా గ్రమ్మియున్న చీకటులు పటాపంచలయ్యెను. దేవరాయసార్వభౌముల మేలుకొలుపు నుదయరాగ

ముత్తోయన విహంగకూజితములు శ్రావ్యముగా వెలువడసాగెను. కాకులకాకారవంబులును, చరణాయుధంబుల కఠోరనినదంబులును, పురియంతట ప్రతిధ్వను లీనుచుండెను. సమీరాంకురములు పై పై వీవం దొడంగెను. ప్రాగ్దిశాసతి నొసటం దీర్చిన సిందూరలాంఛనమో యన బాలభానుండు తూర్పుకొండపైం దేజరిల్లెను. అంధకారమలమినపుడు పతులను గానక వగచుసతులును, సతులను గానక శోకించుపతులును, తెల్లవారుటచే, పరస్పరముగలసి చక్రవాకదంపతులు సంతసిలుచుండెను. కాసారంబులం గమలతండములు వికసించుచుండెను. మకరందాపేక్షమాని సంధ్యారాగసమయమున నరవిందములనుజొచ్చి యినుండస్తంగతుండగుటచే నాతామరలు ముకుళింప రాత్రియంతయుం దానిం దెలియక యాకమలతండములందే యడంగియుండిన భృంగసంతతులు సూర్యోదయానంతరమున వికసించిన ఝుంకారములతోం బైకెగయుచుండెను. తెల్లవారెనని శత్రువును పెడకెక్కలు విఱిచి కట్టి రాజభటులు కారాగారము చెంతకుం గొంపోవుచుండిరి. పురవీధులగుండా పశుగణంబులు మందలకేగుచుండెను. అంతకు మున్నె మేల్కాంచిన పురపౌరులు, వీరికి సంబంధించి విశేషమేమని భృత్యుల నడుగంజొచ్చిరి. వారెద్దియుం జెప్పక రాచమార్గమును బట్టి పోవుచుండిరి. మూత్రవిసర్జనమొనర్ప ఘోషాయి, భటునిం బ్రార్థించెను. పెడకెక్కలు విఱిచికట్టియుండిరిగాన వేడికోలును భృత్యులంగీకరించి కట్లను సడలించిరి. పదియడుగుల దూరమేగి యాఘోషాయి లఘుశంకకుం గూర్చుండెను. కడుజాగరూకత

భటులితవి వీక్షించుచుండిరి. బంధితుఁడౌర శిలక్రింద నేదియో దాచినట్లు భృత్యులకుఁ గోచరించెను. భృత్యులిర్వురు తటాలున వానిపైఁబడి యిరుకరంబులఁబ ధి చి శిలమ్రుదోసి చూచిరి. మడుపులు మడుపులుగా మ డిచినచుట్టయొకటి వారికంటఁ బడెను. ఆమడుపునువిప్పిచూడ జేనెడు పొడుగును, నంతియ వెడల్పునుగల ముసుకవసనమువకు మసిబొగ్గురాచినదిగా వారికిఁ దోచుచుండెను ఆవసనముపై తెల్లరాతిబలపముచేగీచిన కొన్ని యక్షరములు వారికంటఁబడ వెంటనే వానిఁగొనివని కారాగారమునుజేర్చి దేవరాయల కాకమ్మనొసఁగిరి. సమయానుకూలుఁడై యరుదెంచిన యమాత్యునిఁగాంచి, కమ్మఁజదువ రాయలాజ్ఞాపిఁచిరి. సచివుఁ డిట్లు చదివెను.

చిరంజీవి ప్రాణహితయగులలిత కనేకాశీర్వాదములు. ఉభయకుశలానంతరము.

లలితా! విజయనగరమున నేఁ బడరానిబన్నములపాలైనను, మొఘలుసుల్తానులయాదరింబులకులోనై, సుఖనై మనుచున్నదానను. కడచినకదనమందు ఫిరోజిషాగారిచేతికిఁదగిలిన గాయమే వారి దేహారోగ్యమునకు భంగకరముగానుండుటచే వారు నాకొనరించిన వాగ్దానమును శీఘ్రకాలమున నెరవేర్ప వీలుపడకున్నది. మహారాజుగారి మరణవార్తవిని కడునంతసించెదను నాకు దేవరాయునిఁజంపి మొఘలులందు కీర్తిప్రతిష్ఠలుసంపాదింప సాహసింపుము. రాయలను విషగ్రస్తునిజేసితివా? నిన్నహమ్మదు

షాహాయును, నన్ను ఫిరోజిషాహాయుఁ దప్పకఁ పరిణయమాడఁ గలరు. అందులకై యిర్వురుగూఢచారులను నీచెంతకనిపియున్న దాన. ప్రయత్నము సఫలమైనవెంటనే నీవందుండక వీరితోఁ గలసి ననుఁజేరుము. నీరక్షణమున నీప్రచ్ఛన్నవేషధరులప్రమత్తులై యుందురు. ఇది నిజమని ముమ్మాటికి నమ్మియుండుము. ఎట్టియిక్కట్టులొదవినను కార్యసాఫల్యమొనర్చి మెప్పొంద వేగ రమ్ము. ప్రయత్నము సఫలమగుగాత.

దౌలతాబాదు. } ఇట్లు వసంతసేన,
నీయాఅవప్రాణము.

సంపూర్ణముగా రాయలు కమ్మనాలించిరి. పత్రికయందలి విషయములనుఁగూర్చి యాలోచించుటలో వసంతసేన ద్రోహబుద్ధియు మొఘలుల కృతనిశ్చయమును, తేటవడియెను. ఇపుఁ డాతనిమానసమున నూతనాంశములు పొడకట్టసాగెను. క్రోధదేవత భ్రూమధ్యమునఁదాండవమాడ కటితటములదుర మంత్రితో నిట్లనియెను.

అమాత్యవరా! వసంతసేన యీర్ష్య త్రాచుపాము వంటిది. ఎన్నఁడోజరిగిన తనపరిభవమునుగూర్చి, నేఁటికిని చలమువీడక సాధించుచున్నది. చూచితే? అపుడువిడిచి బుచ్చుటచే నిపుడిట్టి ప్రమాదమొనర్ప సాహసించె. స్త్రీతంత్రమని యేమఱియుండరాదు. బంధితునిఁజూడ చెఱసాలచెంతకరుగుదము. రమ్ము అనిరాయలు కారాగారమును జూడఁబోయెను.

చదువరులారా! పరిభవానలమునకుఁబాలుఁగొన్న వసంత సేన రాష్ట్రభ్రష్టయగుటనుగూర్చి మీరు వినియుంటిరిగదా? ఆసేనయే మొఘలురాజ్యమునఁజేరియుండిఖాజీవజీరులనుదర్శించె. తమకొనర్చినయుపకారమునుదలచివారు సాహాచెంతకుఁగొనిచని వారిపోషణమందే నిలుపునట్లేర్పాటొనరించియుండిరి. అపుడపుడు విజయనగరపురాజుల మాయమర్మములఖాజీవజీరులకుఁదెల్పుచు వసంతసేన దౌలతాబాదునందు సుఖమై కాలమును గడుపు కొనుచుండెను.

ఇపుడాసేనయే లలితకొకకమ్మఁ బంచినది. ఈ లలిత యెవరో తెలియ మీరాతురులై యుందురు. లలిత సేనకుఁబర మాప్తురాలు. ప్రాణసఖి. తన్ను బంధవిముక్తనుజేయుటయందు లలితయెటులలైనను బ్రయాసపడునని సేన విశ్వసించియుండెను గాని, తాఁదెచ్చుకొన్నత్రాళ్లు తన్నే గట్టనుపయోగించెననురీతి కేశకలాపమందు మడచిదాచినకమ్మ దొఱకుటచే సేనకుసహాయ మొనర్పనొకలలితకే కాదు. ఏరికిని సాధ్యపడకపోయెను. సేన బన్నమొందినదగుట మానసము ఈర్ష్యాసూయాదులకు స్థానమై బహమనీసుల్తానుల కెటులైనను విజయమొనఁగూర్పనెంచియు నాంధ్రరాజులందుఁదనకుఁగల క్రౌర్యమును బాపుకొననెంచియు లలితచే రాయలకు విషముఁబెట్టింపఁ గమ్మఁబంచెను. భృత్యుని చేఁజిక్కి లేఖఁబఠికించినవెంటనే వసంతసేనకు జరిగినమర్యాదయే లలితకుగూడను జరుగవలసియుండెనుగాని, మూఁడుదిన ములక్రిందటనే లలిత సర్పదష్టయై శివపురికేగియుండుటచేనింకేమి

చేయఁగలరు? కారాగారపుచెంత కమాత్యునితోఁ జేరఁబోయిన రాయలు, బంధితునిమఱల శోధింప నాజ్ఞాపించిరిగాని, వాని చెంత మఱేమియుఁదొరకలేదు. వసంతసేనలేఖను విమర్శింప బంధితుని విచారించుటలో, వాఁడే ఖాజీయని తెలియఁగలిగెరి. ఇఁక నారంభమున పలాయితుఁడగు ప్రథమునిఁగూర్చి విచారింపనేల? అతఁడు వజీరు మియర్ జాప్ ఉల్లా యని స్పష్టమే గదా? పాపము! మిత్రునిఁబాసినవంత యొకవంక! గుట్టురట్టయ్యెననుచింత యొకవంక! కార్యము విఫలమయ్యెనను నాలోచన మొకవంక! తనువేధింప, పాపము! ఖాజీ కారాగారమునఁ గడు గనలుచుండెను.

---

## పదునైదవ ప్రకరణము

### కపటలేఖ

దినకరుఁడుదయించి తనబాలకిరణములఁ బ్రసరింపఁజేసి భూకాంతకొక నూతనాలంకార మొసఁగునుగాన మీమీస్థానములకు మీరేగుఁడని నిశాసంబంధమగు గ్రహకుటుంబములకుఁ జెప్పువార్తాహరులువోలెఁ కుక్కుటములు దమతమపక్షముల విదిల్చుచు భుగ్నకంఠమునఁ గొక్కరొకో యని కూకలిడ జ్యోత్స్నకళలంతరించుటయుఁజుక్కలుమాయమగుటయు నొకే సమయమునఁ దటస్థించెను. దీర్ఘకాలమెడబాసిన శ్యామసుందరుని మిత్రమండలివదనపద్మములువోలె దిశాంగనలు ధవళకాం

తులఁ దేజరిల్లెను. సుందరుని సందర్శించు ప్రథమసమాగమమునఁ జెలఁగెడినెచ్చెలులకు వార్తలోయన దివాకరునిదర్శించు పక్షుల కలకలనాదంబులు పెచ్చుపెరిగెను. కారాగారమునందొదవినయు నర్థమునువిన్న యహమ్మదుషాహామరాగ్రహచిహ్నమోయన ప్రాగ్దిశాంగన యరుణకాంతినిఁ బురుడించుచుండెను. రణభూమిని విజయమొనఁగూడి విజయనగరపు సార్వభౌములెత్తు విజయప తాకమోయన నుదయాచలంబున నర్చిష్మంతుఁడు దేదీప్యమానమై ప్రకాశింపఁజొచ్చెను. సుందరుఁడు చెఱవిడువఁబడెనని సంతోషవార్త విన్న కేరళనరసింహరాయలచిత్తంబువోలె కాసారములయందలి కమలజాతములు వికసించి కళకళలాడుచుండెను.

ప్రొద్దెక్కియు సుందరుఁడు నిద్రవీడమికిఁ గారణము దోపక బాజాబహుస్సేను గుయ్యాడనారంభించెను. ప్రత్యుత్తరంబులేమికి వెరగంది బాబాబహుస్సేనెందుఁబోయెనని యారయఁ జొచ్చెను. వ్యర్థప్రయత్నుఁడై చెఱవాకిటకరుదేరి తాళము దెఱచి లోనికేగెను. తల్పముపైఁబరుండినవాఁడు సుందరుఁడే యని పైవలువను వెడలించెను. తలగడలను మానవాకృతిగాఁ దీర్చియుంచుటకు భీతిల్లెను. భృత్యునియొడలు వడఁకసాగెను. నోటఁదడియారెను. మోము వెలవెలఁబోయెను. పెదవులదరఁ జొచ్చెను. కంపముద్భవించెను. బాబాబహుస్సేనును బిగ్గరగాఁ గుయ్యోడఁజొచ్చెను. కంఠమునత్రాణమారి స్వరముహీనముగా నుండెను. ఏదిశనుండియుఁ బ్రత్యుత్తరము వెలువడలేదు. సుంద

రునిజాడ గనఁబడలేదు. ఏమి చేయఁగలఁడు? బంధితుఁడులేని సందియము, భృత్యువిఁగాననిచింత, షాహానుండి తనకొదవ నున్నయపాయము నొక్కమారే పెనఁగొన నాభటుఁడు భీత చిత్తుఁడయ్యెను. దారిబోకులాసంచుఁ గనుఁగొనిరి. నిమిషకాల మునసే వార్తపురియంతయు వ్యాపించెను. ఇందుఁబడి యందుఁ బడి రాజనగరునకంది షాహా చెవిఁబడెను. ఇఁకఁ జెప్పవలయునా? మూర్తీభవించిన యాగ్రహదేవతయో యన రూక్షేక్షణుండై సుల్తాను వజీరునితో చెఱచెంత కేతెంచెను. అందున్న భటుని విచారించి జరిగినయనర్థము దెలిసినవెంటనే, గస్తుదిరుగుభృత్యుఁ డొకఁడు పలాయితుఁడగుటయు వేఱొకఁడామర్మమెఱుఁగక యశ్రద్ధతోనుండుటయు విమర్శించి భృత్యులిర్వురు శ్యామసుంద రునకుఁలోబడిరని కినుకనూనెను. షాడమినకోపమునఁ దిక్కుఁ దోపమి నందున్నద్వితీయునిఁగూడను, కారాగారమునఁ బంధింప నాజ్ఞాపించి మందిరముఁజేరి దీర్ఘచింతాపరవశుఁడై యుండెను. కాలచక్రము దిరుగుచుండెనుగాని యది యహమ్మదుషాహా కతిదీర్ఘముగాఁ దోచుచుండెను. సంధ్యాకాలము సమీపించు టయు రాష్ట్రిమర్మములారయఁబోయిన భృత్యులిర్వురే తెంచి, షాహాకు సలామొనరించిరి. వారింగాంచి షాహా యిట్లనెను.

మీరరహస్యసంచారము విశేషముల కెఱమిచ్చినదా?

విజయనగరపుసార్వభౌములు ఓరుగంటి ప్రముఖులు, కేరళపుసామంతప్రభువులు దీర్ఘసహ్యామూనియున్నారు. ఎటు

లైనను మనల జయించి శ్యామసుందరునిఁ జెఱనుండి విడిపింప వలయుననియు; ముద్దగల్లు పానుగల్లుదుర్గములు తమస్వాధీనముఁ జేసికొనియే తీరవలయుననియు, కృతనిశ్చయులై యున్నారు. విజయనగర కారాగారమున ఖాజీకెట్టి ప్రాణభయమును గలిగినట్టు తోఁచలేదు. వినుటయందు సుఖియైయ్యెమనుచున్నాఁడనువదంతి గలదు. వసంతసేన నెచ్చలియగు లలితవిషగ్రస్తయై కొంత కాలముక్రిందటనే గతించినది. విషయములన్నియు నిట్లున్నవి. మఱియొకవిశేషమేమన అహమ్మదునగరమునొద్ద శ్యామసుంద రుని మనభృత్యుఁడగు బాబాహుస్సేనును గాంచితిమి. మాగుట్టు బయలుపడకుండఁ బోరుగువారిచే వారివృత్తాంతమారసితిమి.

తాముచెఱనుండి శ్యామసుందరుని విడిచిపుచ్చితిరనియు, తామోరుగంటిరాజుచెంతకుఁబోవుచున్నామనియు, బాబాహు స్సేను సుందరుని నోరుగంటి రాజునకప్పగించి తాను మఱలదౌల తాబాదునకు మఱలుదుననియు, వారిచే వింటిమని విన్నవించి వారేగిరి. ఇపుడు షాహాహృదయమందారాటము మఱింత యధికమయ్యెను. భృత్యుఁడొనర్చిన యపచారమును దలఁచిన నాతనిమానసము పాదరసముపోలె పారాడుచుండెను. వార్త లన్నియుఁబ్రత్యక్షమునవిన్న వజీరుఁడు బాదుషాతో నిట్లు విన్నప మొనర్చెను.

ప్రకృతము నాకొకయుపాయముతోఁచుచున్నది. విజయ నగరపురాజుల కొకసందేశమంప నిదితగుసమయము, మఱియు

శ్యామసుందరుఁ డోరుగంటినుండి విజయనగరమును జేరకమున్నె యీసందేశము నాంధ్రరాజులకుఁ జేర్చుట ముందటి ప్రయత్నముల కనుకూలమగుమార్గము. సందేశమిట్లుండవలయు.

"దీర్ఘవైరమును త్యజించి శ్యామసుందరునిఁ జెఱనుండి విడిచితిమి. సుందరుఁడుకోరినరీతి మాభృత్యునితో నోరుగంటి కంపితిమి. అందులకుఁ బ్రతీకారముగా మీవిజయనగరపుకారాగారమునందున్న మాఖాజీని విడిచిపుచ్చవలసినది. వెనుకటికలతలఁద్రోసి యన్యోన్యమైత్రిచే మెలఁగుట యుభయరాజ్యముల శాంతిశ్రేయోదాయకము. రాష్ట్రపునరిహద్దులందలి దుర్గములు వారివారివి వారేపాలించుకొనవచ్చును." అనికబురంపితిమేని ఖాజీకిబంధవిముక్తి గల్గఁ గలదనితోఁచుచున్నది. ఖాజీ మనలఁ జేరినవెంటనే మనమోరుగల్లునుముట్టడించి మఱల శ్యామసుందరునిఁ జెఱపట్టవగు. మనయొప్పికోలు లేక యపరాధిని తనరాజ్యములఁజేర్చినందులకు పరిహారముగా గొంతరాజ్యమివ్వవలసినదనియు, అట్లొడఁబడకుండిన నతనిఁగూడను బట్టిసాధింపనగుననియు నాకుఁదోఁచుచున్నది. మీహృదయమెట్లంగీకరించిన నాదారిఁ జేయ స్వతంత్రులరై యున్నారు. బాబాహుస్సేనుగూడను అక్రమమునుగప్పిపుచ్చి, సుందరుఁడు తమచేవిడువఁబడినట్టే నుడివియున్నాఁడు. ఇదియే మనకనుకూలమగుమార్గము.

ఈయాలోచనములన్నియు సమంజసక్రియ ననుసరించుచున్నవి. సుందరుని మనమేవిడిచితిమన్న విజయనగరపురాజులు

నమ్మి ఖాజీని విడుతురా? అను విషయమే యనుమానమును సూచించుచున్నది.

ఆంధ్రరాజులందఱు నిపుడేకీభవించి యున్నారు. సుందరునిరాక యిదివఱకే విజయనగరపురాజులకు సూక్ష్మముగాఁ దెలిసియుండకపోదు. వారిపై నేరారోపణమొనర్పక వాఁడు విజయనగరమును జేరకమున్నె మనసందేశమువారికందెనాయం దుఁగలకొన్ని సమాధాన వాక్యములుగని, వారానందించకపోరు. సంతోషానంతరమున సుందరుని విడుదలకూడను నిజమనియే భావింతురు సామమార్గమునువిడిచి దండోపాయమునకుఁదలఁ పడఁ దడవుకొంటిమేని పైఁబడను కింతురుగాని, తమంతఁదామే కచ్చిఁబెంచుకొని కదనమునకుకాలు ద్రవ్వరు. కావున ఖాజీకి బంధముక్తిఘటింపఁగూడను నిదియే సన్మార్గము.

మనసందేశమందినతోడనె రాయలు సరిహద్దుదుర్గము లాక్రమింతురుగదా?

వారికంతటిమెడమబ్బుటలేదు. ఖాజీకివిముక్తిగల్గినవెంటనే మనము తప్పక ఓరుగంటిని ముట్టడింపవలయును. వెంటనే వార్తవిజయనగరపురాజులకుఁ దెలియును. సుందరునిరక్షణార్థము ఓరుగంటిరాజునకు సహాయమొనర్ప వారురాకపోరు. కదనమున కెత్తివచ్చినప్పుడుడు సందేసనంబంధములగు నిబంధనలంతరించి నట్లేకదా? అప్పటికిఁ దగినమార్గమును మనము వెదకికొనఁ జాలమా?

అయిన నాప్రకారమే సందేశమునువ్రాసి, సరియైనచతురునివెంట నద్దానిని నేఁడే పంపివేయుము.

---

## పదునాఱవ ప్రకరణము

### శ్యామసుందరుని సాహసము

కాలచక్రము గిరగిరఁ దిరుగుచున్నది. ప్రజలసుఖముల కయ్యది యొకేవిధమగునానుకూల్యమును గూర్చుచుండదు. ఒకతరి ప్రపంచమున నతివృష్టిదోషమొదవి యందందు జలప్రళయములు ప్రబలి వేలకొలఁదిజనులు గంగకుఁగాత్రము లొసఁగుచుందురు. వేఱొకపరి భూకంప మొదవి లక్షలకొలఁదిప్రజలు ధరణిపాలగుచుందురు. మఱియొకపరి మహామారి ప్రవేశించి కోట్లకొలదిప్రాణులఁ దనపొట్టఁబెట్టుకొనుచుండును ఇంకొకపరి మారియు,స్ఫోటకమునునొకేసమయమునఁదలసూపియసంఖ్యాకములుగ మానవులమెసవుచుండును. అంతియెగాక యీతిబాధలపాలై లోకులంత మొందుచుందురు, లోక మిట్టియాపదలనుండిగడచి గట్టెక్కినా రాజులకన్యోన్య కలహములుద్భవించి తన్మూలమున నీర్ష్యలెక్కుడై, శౌర్యముప్రబలి, లెక్కకుమించినప్రజలు భూదేవికిఁబలియగుచుందురు. ఇట్లగుటకుఁ గారణ మారయఁగొరితిమేని, కొందఱిది యకాలమృత్యువందురు. మఱి కొందఱు ప్రజలపాప మీరీతిఁ బరిణమించినదందురు. ఇంకనుఁ గొందఱు భూభారమును దీర్పఁగపటనాటక సూత్రధారియగు

సృష్టి, స్థితి, లయ, కారణకర్తయొక్క లీలావినోదమందురు. ఇందేది నిజము? ఏదికల్ల?

మహాశయులారా! "పుట్టినవాఁడు, గిట్టకమాన"ఁడని పర్యవసానమునుదేల్చి కథాసరణి ననుసరింతము.

పంజరబద్ధమగు హర్యక్షమునకు స్వేచ్ఛయొదవినఁ బొడ మెడురోషంబుపగిది విజయనగరపుకారాగారమునుండి విముక్తిఁ గనిన ఖాజీకి క్రోధమెక్కుడై దాఁబన్నెడి కృత్రిమవ్యూహంబులకు వజీరునొకని సహాయంబుఁగొని యెట్టకేల కహమ్మదుషాహాను దనవలయందుఁ బడఁద్రోసెను. ఫిరోజీషాహాను యువరాజుచేఁజెప్పించి యహమ్మదువజీరులను పానుగల్లును ముట్టడించుకట్లొనర్చెను. ఫిరోజిషాహాను తానే సమ్మతిలఁజేసియోరుగల్లుపై దాన వెడలెను. ఉభయులును తాముతాము సంకల్పించుకొన్నస్థానముల ముట్టడించిరి. అదివఱకే మొఘలులదుండగములనుగూర్చి తనరాష్ట్రమును గాపాడుకొననెంచిన యోరుగల్లు ప్రముఖుఁడప్రమత్తుఁడై పానుగల్లు దుర్గరక్షణార్థమై తగుసేనల నందేనిల్పెను. మొఘలులు కోటను ముట్టడించినసంచుఁగని యాంధ్రసేనలు ప్రహరిద్వారములబంధించి కోటనాపుచేసుకొని లోనుండియే శత్రువుల నురుమాడుచుండిరి. కోటనుఁబడజేల్చి దుర్గమునువశముఁజేసిన మహమ్మదీయులప్రయత్నములు నిరర్థకమగుచుండెను. పానుగల్లు తురుష్కులవశము కాలేదు. వత్సరద్వయ మతిదారుణముగాఁ బోరుజరుగుచుండెను. సదాశివా

నందరాయలు విజయనగరమునువీడి యోరుగల్లును జేరియుండిరి. శ్యామసుందరుఁడు కేరళనరసింహరాయలకుఁ గుడి భుజమనియు, సమితవిక్రమమున మొఘలు సేనల హతమొనర్చిన వాహినీపతి యనియు సదాశివరాయలచేఁ దెలసిన యోరుగంటికృష్ణదేవుఁడు బహమినులకారాగారమునుండి విముక్తిఁగనిన శ్యామసుందరుని మనఃక్లేశముఁ బాయఁ గొంతకాలమందే విశ్రాంతిఁ గొన సుఖవసతులనుగల్పించి యాదరించుచుండెను. ఈతరుణమందే మహమ్మదు షాహా యోరుగల్లును ముట్టడించెను. కవాటములను బంధించి కుడ్యములచాటునుండి యోరుగంటి సేనలు శత్రువులఁ జీకాకుఁ బఱుప మొదలిడిరి. షాహా నుజయించునంతటి సేన తనయొద్ద లేనందున సదాశివానందరాయ సింహాద్రులఁ జేరఁ జీరి కృష్ణదేవుఁ డిట్లనెను.

బహమనీసుల్తానులకును నాకును వివాదప్రదేశము పానుఁగల్లు దుర్గమగుట నా దుర్గస రక్షణార్థమై తగువసతులొనగూర్చితినిగాని మొఘలులు ఓరుగంటిని ముట్టడింతురని స్వప్నమందైన నేనెన్నియుండలేదు. దీర్ఘకాలమాజి తెగమి నున్న స్వల్ప సేనలును సన్నగిల్లునట్లున్నవి. శత్రుమారణమునకు వెరవుఁ దోపమిను విజయమునుగూర్చి సందియపడుచున్నాఁడ. ఉపాయమెద్ది?

సదా—విజయము మనదని మేమానందించుచుండ మీరేలకో యీరీతి సందియపడుచున్నారు.

ఆనం—మీరుగ్గడించి తెల్పువిషయ మొక వాసరమునాఁటిమాట. పదివేలసేనల నొక్కనాఁడే హతమొనర్చిన నాఁటి విజయమునుగూర్చి మీరు ముచ్చటించుచున్నారు.

సదా—అవును. ఇపుడేమిమించినదని కృష్ణదేవుల కీమనః క్లేశము?

ఆనం—మొఘలులసేన బాహుళ్యమని.

సదా—మొత్తమున మనరాణువ తక్కువసంఖ్యగలదైనను తమంతఁ బదంతలు శత్రుసేనల నుగ్గు నూచ మొనర్చి నారు. అది నీవెఱుఁగవా?

కృష్ణ—నాటిసంగతి మనకే విజయసూచకమని నేనుగూడను దలఁచియుంటిని. నేటిసంగతివిన్న మనసేన సన్న గిల్లినది. బీదరు బీజాపురములనుండి యేఁబదివేల కెక్కుడగుసేన షాహాకు సహాయమొనర్ప మనపైఁ దలపడినది. ఆసేనలకును, మనవాహినికిని, హస్తి మశకాంతరము వారయని, నే శంకించుచున్నాఁడ.

సదా—నేఁడీసమాచారము మీకెట్లందినది?

కృష్ణ—వేగులు నుడివిరి.

ఆనం—వేగులునుడువుటయు నిజమే. సేనలరుదెంచుటయు నిజమే. తండోపతండములుగా బారులుదీరియున్న మొఘలువాహిని శరధివోలె నావరించుకొనియుం డుట నేనెఱుఁగుదు.

శ్యామ—మీరిట్లాలోచించిన ప్రయోజనంబుగానము. హఠాత్తుగా శత్రువులు కవాటములఁజీల్చి పురిఁజొచ్చిన రక్షణోపాయమునకు సన్మార్గములున్న వా ?

కృష్ణ—పురిబాహ్యప్రదేశముఁనకరుగ గూఢమార్గములున్న వి.

ఆనం—పురిచుట్టును నొక క్రోసుదూరమువఱకు మొఘలు వాహిని చుట్టియున్నది.

కృష్ణ—క్రోశత్రయదూరమేగు రహస్యమార్గములున్న వి. ఆదారి నేగిన వైరులకెఱుకవడదు.

శ్యామ—ఇఁక నాలోచనంబేల ? ఆదారిపరిచయమెఱిఁగిన యొకచారుని నావెంటఁబంపుఁడు. నేబైటికేగితినా? ఒకవాసరమున విజయము కట్టినమూట యని మీ మదిని ధృఢముగా నమ్మియుండుఁడు.

కృష్ణ—అట్టిచారు లిర్వురే యిందున్నవారలు. దానపెరరాజులకుఁ గబురంపఁదామసించితి. ఇపుడిట్టి ప్రమాదము సంభవించినది.

శ్యామ—మీరిఁక నాలోచింపఁబనిలేదు. దారిఁజూపనొక్క చారుఁడే నావెంటవచ్చినఁజాలును. ప్రకృతమున్న సేనలతో శత్రువులనెదిరించుచుండుఁడు. పిమ్మటఁ బనులన్నియుఁ జక్కనగు.

అని శ్యామసుందరుఁ డొక్కసేవకునితో గూఢమార్గము గుండా బయటికివెడలిపోయెను. మొఘలుసేనలు నోరుగల్లు సేనలు విడువక ఒకేరీతిఁబోరుచుండెను.

---

## పదునేడవప్రకరణము

### సంపూర్ణవిజయము

ఓరుగంటియందు ఫిరోజిషాహాఖాజీలగొ త్తడి మిక్కుటముగానుండెను. మొఘలుసేనలు ఆత్మలకాసఁగొనక యాల మొనర్చుచుండిరి. ప్రహరిగోడ్యములఁబడఁగూల్చి లోనికరుగఁ గొందఱు యత్నించుచుండిరి. కవాటములఁజీల్చి యంతర్భాగమునుజొరఁ గడుప్రయాసమునఁ గొందఱు సధైర్యమునఁబోరాడు చుండిరి. ఆంధ్రసేనలు మొఘలులధాకలకుఁ దాళఁజాలక వేల కొలఁది శవపురికరిగియుండిరి. మృత్యుముఖమునకుఁ దప్పినిల్చిన యల్పసేనలే తెగువనూని పోరాడుచుండెనుగాని యది కడు హీనంపుపోరాటమై యుండెను. అంతంత కాంధ్రసేనలుసన్న గిలుట మహమ్మదీయులు కోటగోడల నాక్రమింపఁజొచ్చిరి. ప్రహరిద్వారములతలుపులు బ్రద్దలగునట్లు కరులనుఢీకొల్పియోరు గంటి పురివీధుల మొఘలు లాక్రమింపఁజొచ్చిరి. పౌరాంగనల యొక్కయు, అంగవైకల్యులయొక్కయు, వృద్ధులయొక్కయు, బాలురయొక్కయు నార్తధ్వనులు మిన్నంటెను. ఓరుగల్లు తురుష్కుల స్వాధీనమగు ననుతలంపు కృష్ణదేవునకు నధికమగుచుం

డెను. అతనిమానసము నిరాశయందుఁబడి యూఁదులాడుచుం డెను. సదాశివానందరాయలొనర్చు నమోఘప్రయత్నములు తురుష్కులకట్టెదుట వ్యర్థములగుచుండెను. అందఱును అప జయమును స్థిరీకరించిరిగాని, పోరాటమునుమాత్రము వీడకుండిరి. ఓరుగంటిస్థితి కడునపాయమందున్నను దానొకటిదలఁప దైవ మొకటిదలంచుననురీతి దైవాజ్ఞ వేఱువిధముగా నుండెను.

విజయనగరమున దేవరాయలనుదర్శించిన శ్యామసుంద రుఁడు, ఓరుగల్లు దుస్థితిని విన్నవించుటచే, సామంతవర్గముతో డను, అమాత్యులతోడను రాయలు కోపోద్దీపితుఁడై పదివేలు కెక్కుడగు సేనలతో, సింహాద్రిహరిహరులను వెంటఁగొని యోరుగంటిపై దాడివెడలెను. విజయనగరమున రాయలచే ననుజ్ఞఁగొని శ్యామసుందరుఁడు కేరళమునకేగి, స్థితినంతయు విన్నవించి యిరువదియైదువేలకెక్కుడగు సేనలకుమొనయై నర సింహరాయలతోనోరుగంటికిఁ బ్రయాణమయ్యెను. ఓరుగంటియొద్ద నిరుసేనలు నొకేతూరి సంధించెను. శ్యామసుందరునిజంటనరు దెంచినవాఁడు మున్ముందే యరుదెంచి కృష్ణదేవున కీవార్తవిన్న వించెను. మఱల నాభృత్యుఁడే బయటికరుదెంచి పదివేలమంది యోధవీరులఁగొని గూఢమార్గముగుండా వెడలి యోరుగల్లు కోటపై కెక్కించెను. రాజవీథులందుఁ బ్రవేశించిన మొఘలు వాహినిపైఁబడి కొందఱు వీరులు పురివెడలనడచిరి. మహమ్మ దీయసేన వేదారినేగ వీలులేకుండునట్లు బాహ్యభూమినున్న

కేరళవిజయనగరపు సేనలు చుట్టుముట్టెను. కోటలపైనుండు యోధు లపరిమితమగు బాణవర్షములచేఁ బాధింపఁ బ్రయత్నించిరి. బయటినుండి విరామములేని యగ్నిగోళములచే, కేరళ విజయనగరపుసేన లరులను నురుమాడఁజొచ్చెను. మొఘలులకుఁ బ్రాణభీతియెక్కుడగుడు దిగ్భ్రమనొంది దిక్కుదోచకుండెను. ప్రత్రోవనేగుదమన్నను నాంధ్రులు త్రోవవీడకుండిరి. ప్రత్యక్షమున కోటపైనుండికురియు బాణవర్షము పరోక్షమున బయట నుండిగురియు నగ్నివర్షము. విరామములేక యొకేరీతి వర్షించుచుండెను. చేయునదిలేక వేనవేలు మొఘలుసేనలు మృత్యుముఖమున కాహుతియగుచుండెను. కొందఱాంధ్రులధాటికిఁ భీతిలి గుండెలవిసి ప్రేతపురికరుగుచుండిరి. అగ్నికాహ్యాహుతి నొసంగినరీతి, పాపము మొఘలువాహినియందు మారియొకటి ప్రవేశించి ప్రాణములమెసవఁజొచ్చెను. ఏయాధారమునులేమి తురుష్కులు కొందఱాహారమునను, కొందఱు మారిబాధచేతను, మరణమొందిరి. ఫిరోజిషాహా పాఱిపోయియైనఁ బ్రాణములు దక్కించుకొనుదమన్నను దారిలేకుండెను. ఖాజీసాహానమున గాయపడినవారి కుపచరించు భృత్యునివేషమూని యెట్లో కడు ప్రయాసమున నాంధ్రవాహినిని వదలిపోయి ప్రాణాతురత చాలతాఁబాదునకుఁ బాఱిపోయెను.

రెండవపర్యాయ మట్లే ప్రాణములుఁగాపాడుకొనవెంచి చారవేషమునఁబోవుచున్న ఖాజీనిఁగుర్తించి, సింహాద్రి వానిని

ఖండతుండెములుగా నరికివేసెను. ఇంతలో ప్రథమమున నేగిన భృత్యుఁడు ఫిరోజిషాహాయని శ్యామసుందరునకుఁ దెలియ వచ్చెను. వెనువెంటనే విజయనగర కేరళసేనలను మొఘలు రాజ్యముపై నడువ నాజ్ఞాపింప రాయలయనుమతివడసి సదా శివానందరాయలతో వెడలువాఁడు మార్గమున పానుగల్లును ముట్టడించిన యహమ్మదుషాహానుఁ దలపడెను. అందు గోల కొండనవాబును ముద్దనండనాయకుఁడు డీకొనెను. బీరారు సుల్తానుపై గుండయామాత్యుఁడు ప్రతిఘటించినిల్చిపోరఁదొడఁ గెను. అహమ్మదునగరప్రముఖుని కేరళనరసింహరాయలుదాకిరి. వజీరుమియర్ జాప్ ఉల్లాను ఓరుగంటికృష్ణదేవుఁడునిలువరించెను. సదాశివానందరాయ సింహాద్రిశ్యామసుందరులు, అహమ్మదు షాహాను జుట్టుముట్టిరి. ఫెళఫెళారవంబులపిడుగులు వడ్డవడుపున, నొకేరీతి వెంటవెంటనె వేతెంచు యాంధ్రచమూసమూహాముల బాణపాతములకు నిల్వఁజాలక మొఘలుసేనలు పటాపంచ లయ్యెను. పాఱిరుఁడు. చచ్చిన స్వర్గలోకము. బ్రతికినఁ బేరని సేనలనెచ్చరించి యనికిబురిఁ గొల్పుచు నరుదెంచుచుండిన వజీరుని గాంచినవెంటనే చెలవెట్టినసీచుఁడు వీడెగదా యనునాగ్రహంబు పెచ్చుపెరుగ వక్షస్థలంబునకుఁ జూట్కొనిల్పి ఒక్కనిశితశరం బును శ్యామసుందరుఁడు విడువనాదారుణకీలకుఁదాళజాలక వజీ రుఁడు విలవిలఁదన్నుకొనుచు ప్రాణములు విడిచెను. మియర్ జాప్ ఉల్లాచావునుఁ గన్నులారఁగాంచినయహమ్మదు ఆత్మరక్షకు

వేఱుమార్గములేమిఁ దెలిసి పాఱఁజొచ్చెను. బాలుచుండు యువరాజును వెన్నంటి విలువరించి శ్యామసుందరుఁడు 'ఓహో! యువరాజులా! శారదను బెండ్లియాడెడి మగటిమియింతేనా' యని నర్మగర్భంబుగాఁబలుకుచు సమ్మోహాస్త్రమును కేల సంధించి దృష్టినిల్పి షాహాపై వీడెను. అవ్వాడితూఁపు హృదయ కుహరమునుభేదింప షాహా నిశ్చేష్టితుఁడై క్రిందఁబడిపోయెను. అహమ్మదుషాహా చచ్చెఁజచ్చెనని విజయనగరపు వీరులవీరా లాపంబులు వినువీధిఁ బ్రతిధ్వనింపఁజొచ్చెను. నేలకొఱిగిన షాహాకుత్తుకనుదరిగి పానుగల్లునకుఁ దోరణముఁగట్టుదునని సింహాద్రియువరాజుమస్తకమును దునుమఁబోవుచుండెను. చచ్చి పడినవానిపైఁ బంతముసెల్లునా? యని శ్యామసుందరుఁడు నివారించెను. అహమ్మదు నాంధ్రులవశముఁగాకుండ మొఘులు భృత్యులు రణభూమినుండి దౌలతాబాదునకుఁ గొంపోయిరి.

విజయశీలురై యోధులు విజయనగరపు విజయపతాక ములనుబైకెత్తి, దేవరాయసార్వభౌమా! విజయీభవ, విజ యీభవ యని విజయోక్తులఁ గేరుచుండిరి. కరులపైనను, ఒంటెల మీఁదను అందందు కొల్లగొన్న ధనరాసులనెత్తించి రాయలు పానుగల్లునుఁజేరిరి. హతశేషులమఱుఁగునఁ బడినవజీరుమస్తక మును, పానుగల్లు దుర్గద్వారమునకును ఖాజీశిరమును ఓరుగంటి దుర్గద్వారమునకును తోరణములుగట్టునట్లు సింహాద్రిశ్యామ సుందరులు, కట్టుదిట్టములొనర్చి రాయలదర్శనమున కెదురుఁ జూచుచుండిరి.

మహావైభవసమేతుఁడై యేతెంచిన దేవరాయలు, సామంత నృపులను యోధవీరులను జేరఁజీరి "మీరందఱు మూఁడవ నాఁటికి విజయనగరమునఁ జరుపుసభకు దయచేయవలయు" నని యాజ్ఞాపించి, సేనలతో విజయనగరమును జేరఁబోయెను.

ఆంధ్రులవిజయమును, తమకొందవినపరాభవమునుగూర్చి లోలోనఁగుళ్లుచు ఫిరోజిషాహా వ్యాధిగ్రస్తుఁడై యడలుచుండెను. లలితమరణమును, దేవరాయలవిజయమును, మొఘలుల పరాభవమును విన్న వసంతసేన యిఁకఁ దనమానప్రాణములు దక్కవని నిశ్చయించి యొకకూపమునఁబడి ప్రాణములువదలెను. శ్యామసుందర సింహాద్రులచేఁ జంపఁబడెనన్న యహామ్మదుషాహాను దౌలతాబాదునకుఁ జేర్చినవెంటనే యెచ్చటనో కొన యూపిరి దవిలియుండి, యతఁడుమూర్ఛదేరి చికిత్సాలయమును జేర్పఁబడెను. పాపము! సింహాద్రిశ్యామసుందరులుదలఁచినరీతి నీతఁడు జావకమఱలఁ జీవించుట లోకకంటకమునకే గదా?

---

## పదునెనిమిదవ ప్రకరణము

### విజయోత్సవము

నేఁడే మనయాంధ్రభూరమణుఁడు విజయోత్సవమొనర్ప నేర్పఱచిన సుదినము అని, దేవరాయసార్వభౌములు విజయ

లక్ష్మినిఁజేపట్టిరని విన్న విజయనగరవాస్తవ్యులందఱు సత్యానందభరితులై తమమందిరముల విజయోత్సవములుసల్ప సమకట్టిరి. నగరమంతయునాఁడు కడుశృంగారమునఁ దనరుచుండెను. విఫణిమార్గములన్నియు చూతపత్రతోరణాలంకృతములై నేత్రానందజనకమై యలరారుచుండెను. సామాన్యమందిరములన్నియు, సుధామిళితములును, అరుణమృత్తికాసంకలితములునై మెప్పుఁగొల్పుచుండెను. ఆలయములందలి విగ్రహములు బంచామృతాభిషేకమున నిర్మలములై స్వర్ణభూషణమణిగణస్థగిత విరాజమానంబులై పార్శ్వయుగ్మముల ధగద్ధగాయమానముగాఁ బ్రకాశించెడు నఖండజ్యోతులచే విలాసవంతములై కన్నులమిఱుమిట్లు గొల్పుచుండెను. ఏచాయఁగాంచినను మంగళతూర్యముల సుఘోషమే. ఏవంకఁదిలకించినను శోభనద్రవ్యములతో దేవాలయంబులకేగెడి సుమంగళులమంజీరారావములే. ఏగృహంబుఁగాంచినను వివిధదానములను స్వీకరించి దాతలనాశీర్వదించు బ్రాహ్మణాశీర్వాద నిగమనినాదమే. ఏ గృహాంగణముల వీక్షించినను రంభాస్తంభములందుఁబొదిగిన చలువచప్పరములే. ఆహా! నేఁడీ విజయనగరరాజ్యలక్ష్మికలియుగమైకుంఠమోయన కళలీనుచున్నది !

ప్రభుమందిరపుముంగిట నస్నాతురుల కన్నదానసమృద్ధి! వస్త్రహీనులకు నూతనవస్త్రాలంకరణీయము !! పాఱుల కపారగోభూహిరణ్యాదిదానము లమేయములు. !!!

ఈవిని దధి శిబి కర్ణాదులసరకుఁగొనక మొఘలులనుండి కొల్లఁగొనితెచ్చిన యమితద్రవ్యమును, అంగవైకల్యులకును, అనాథలకును బిక్షుకులకును చికిత్సాలయములకును, దేవాలయ ప్రతిష్ఠలకును, వాపీ కూప తటాక వనప్రతిష్ఠలకును దేవరాయ మహీంద్రులు పంచిపెట్టిరి. విజయనగరరాజ్యమందలి ప్రజలా బాలగోపాలము నానందాంబుధిమగ్నమానసులై దేవరాయ సార్వభౌముని వేనోళ్లఁ గీర్తించుచుండిరి.

---

## పంచోన్మిదవప్రకరణము.

బట్టబయలు

మఱునాఁడు దేవరాయసార్వభౌముఁడు పేరోలగమునఁ గనకాసనాసీనుఁడై యుండెను. యువరాజగు హరిహరరాయ లతని పార్శ్వమునఁ దేజరిల్లుచుండెను.

మహారాజులును, సామంతనృపులును, అమాత్యులును, సేనానాయకులును, దండనాయకులును, ఉన్నతోద్యోగియులును యోధులునుమాత్రమే యాసభకాగమనులగు నట్లాజ్ఞయగుటచే నొక్కరొక్కరుగానే తెంచి సభనలంకరించుచుండిరి. ముద్దదండ నాయకుండును, గుండయామాత్యుండును, సభ్యులను, అధి కారులను సముచితస్థలంబులఁ గూర్చుండనియమించిరి. నర సింహరాయకృష్ణదేవ్రులున్న తాసనములపై దక్షిణపార్శ్వంబు నను, ముద్దదండనాయకగుండ యామాత్యాదులు వామభాగంబు

నను, సింహాద్రిశ్యామసుందరులు, సదాశివానందరాయాదియోధ చతుష్టయంబు కట్టెదుటను, ఉచితాసనంబులఁ బొడకట్టిరి. అష్ట దిక్పతులసభయోయన కొలువు, చూచుట కత్యంతమనోజ్ఞమై చూపట్టుచుండెను. అందఱును వారివారిస్థానములందుఁగూర్చుండి యుండిరి. ఇంతలో గణగణమని ఘంటారావమావిర్భవించెను. అంతట నిశ్శబ్దము! రాయలయనుమతిని సభ్యులవంకఁజూచి గుండయమంత్రి యిట్లనెను.

అగ్రాసనాధిపా! "సభ్యులారా! మనమెల్లరీసభాభవన మలంకరించుటకుఁగారణము మొఘలులవల్ల మనకులభించిన విజయముఁగూర్చి ముచ్చటించుకొనుట" యని మీరెఱింగిన విషయమె. అదియటుండ, స్వకుటుంబాపేక్షవీడి, స్వస్థానములఁ బాసి, దీర్ఘకష్టములకోర్చిస్వమతాభిమానులై, దేశాభ్యుదయము నకై ప్రాణములకురోసి, దీర్ఘవైరమునుబెంచి మొఘలులనడు గంటఁజేసిన వీరవరేణ్యులఁ బహూకరింపనెంచియే నేఁడీసభప్రారం భింపఁబడినది. త్రిలింగసేనలందలియోధులందఱును తురుష్కవీరు లతోఁ బోరి తమరాజభక్తిని నెరవేర్చిరనిచెప్పినను మీఁదు మిక్కిలి స్తోత్రపాత్రులగు శూరవరేణ్యులు నల్వురని నొక్కిచెప్ప సాహసించినను నెగ్గుఁగాదు. అమ్మహాపురుషులెవ్వరో తెలియ మీరాతురులై యుందురు. అగ్రగణ్యులగు మీముందటనట్టిమహా పురుషులనుబేర్కొన నే మఱింతయాతురుఁడనై కుతూహలపడు చున్నాను. వారెవ్వరందురా? రాయలప్రత్యక్షమందు సము చితాసనములనధిష్ఠించిన నల్వురుయోధులే!

అందగ్రగణ్యుఁడు సదాశివరాయలు ప్రథముఁడు. శారదా వియోగమునఁబొడమినకినుకచే మొఘలులకుబద్ధవైరియై ఆహవ కుశలుఁడగుసింహాద్రిద్వితీయుఁడు. తరుణవయస్కుఁడగు శ్యామ సుందరుఁడు తృతీయుఁడు. సదాశివరాయలకనుంగు చెలియై చేదోఁడువాదోడులందు నతనిమాటకుమారాడక, రణాంగణ మున విక్రమవిహారమొనర్చి యరాతివీరులకసిమసంగినయానంద రాయలు నాల్గవవాఁడు. ముందీనలువురికి పారితోషికంబులొ సఁగి తక్కినయోధుల సముచితరీతిబహూకరించుట నాప్రార్ధనము అని పలికి గుండయమంత్రి కూర్చుండెను.

ఆనల్వురివీరశౌర్యసాహసాది సద్గుణంబును రణాంగణ మునఁ గన్నులారఁగన్న సామంతరాజులు ఇదమిత్థమ్మనితలలూ చుచు, తమయొప్పికోలునగుపరచిరి. రాయలానందించిరి. అందఱు కరతాళధ్వనులాచరించిరి. సదాశివరాయలుసభాధ్యక్షు లను సభ్యులను సంబోధించి యిట్లనెను. క్ష్మామండలాధిపా! మీరుప్రేమపూర్వకముగా గౌరవించి యొసఁగెడిపారితోషికము ననుఁజెందకమున్న, నానిజచరిత్రమును మీ్మామోలను, ఈసభ్యుల ప్రత్యక్షమునను విన్నవించుట స్వరాష్ట్రాభ్యుదయమునకును స్వమతగౌరవమునకును మార్గమెతెలఁచినవాఁడనగుట దానినే నేనుదహరింపనుంటి. ఏమందురా?

అగ్రాసనాధిపా! సభ్యులారా! ఉపాధ్యాయత్వమే నిత్యవృత్తిగాజీవించెడు నేనొకయగ్రవంశసంజాతుఁడను. రాష్ట్రి

యాత్రాతత్పరుఁడగు యువరాజమహమ్మదుషాహ దాలతా బాదునుండి వెడలివచ్చువాఁడు మాబాలికాపాఠశాలఁ దిలకింప ఖాజీతో ముద్దగల్లునకే తెంచెను. అందున్న శారదాసుందరరూపము కన్నులవిందుఁజేయ మన్మథాయత్తచిత్తుఁడై నాజవ్వనిఁదనకుఁ గూర్ప నన్నే సంధాయకునిగా నియమించెను. హిందూమతకళంక మునకు నామానసముచొరకున్నను, షాహ ప్రత్యక్షమున మొగ మోటమునకియ్యకొని, శారదకావిషమవిషయమును బోధించితి. శీలవతియగునా బాలిక కర్ణకఠోరంబులగునా వచనములకు విచారా క్రాంతస్వాంతయై భయకంపితగాత్రయై నామాటలయందలితార తమ్యంబుఁ దెలియమి నన్నునాదరణంబుఁ జేసి, ప్రభువగుషాహ కోరికనునిరసించె. శారదసత్యశీలమునకు నాలో నేనానం దించుచు, భీతిల్లకుమని ధైర్యమును గూర్పఁగను నన్నుసూచించితి గాని, దురాత్ములేదేని కుట్రపన్నుదు రనునూహఁ దట్టినవాఁడ నగుటఁగష్టసమయముదటస్థించిన నెటకేనియుఁబోయి శీలమును గాచికొనుమని ప్రబోధించియుంటి. ప్రస్తావనానంతరమున వారద్వ యంబుగడిచె. ఒకనిశీథిని షాహభృత్యులు శారదను బట్టనుం కించిరి. బాలిక పలాయనయయ్యె. అమ్మగువతలిదండ్రులను ముద్దగల్లునందు తురుష్కులు చెఱవెట్టిరి. బందీకృతులైనయావృద్ధ దంపతులఁ జెఱవిడిపించుభారముఁ గూడను నాపైఁబడుటఁ దత్కా ర్యసిద్ధికి నాయాప్తులనాసించితి. వారూరిజాతరనాఁడు సహాయ మొనరింతుమని వాగ్దానమొసఁగియుండిరి.

అక్లే జాతరనాఁడు నాయాప్తులచే బంధవిముక్తిఁగనిన శారదతలిదండ్రులను విజయనగరముఁ జేర్చి శారదపోకడఁ దెలియ నందందుఁదిరుగుచుంటి. ఇంతలో తురకలు పానుగల్లునజానకిని హరించిరని మఱియొకదుర్వార్త వెలువడియె. జానకీరక్షణము గూడను పాపైఁబడుట, నాకస్మికాపాయములు రెండును వెను వెంటనె దొడరెఁగదా ? యనునాలోచనంబు నాయందభివృద్ధి నొందుచుండ దౌలతాబాదునుఁజేరి సాముద్రికశాస్త్రవేత్తనై రామాపండితుఁడను నామమునఁ బెంపారితి. ప్రచ్ఛన్నవృత్తిహస్త సాముద్రికమునందలినిజముఁ దెలియఁ గరంబుఁ జూచినపాహా యంగుళీయకమును హరించితి. ఖొజ్జావేషమూని కారాగార రక్షకులకాయుంగుళినొసఁగి, భృత్యులను వేఱువోటునకనిచి చెఱనుండిన జానకితో నోరుగంటిమార్గమనుసరించితి. ఆమార్గ మున నేగుమేమిద్దరము రాజాశ్రయమునకుఁదగిన క్షత్రియోచిత వేషములూని, నే సదాశివరాయలు, జానకి యానందరాయలను ప్రాతిపదికముల నోరుగంటిని యోధులై వెలయుచు, మొఘలు రాజ్యధ్వంసమొనరింపఁగారణమారయుచుంటిమి. ఇటీవల మొఘు లులకును మనయాంధ్రరాజులకునుఁ దొడరిన ముద్దగల్లుమర్గ మునకు ఓరుగంటి కృష్ణదేవులచేఁ బంపఁబడి మాశక్తిపంచనలేక ప్రభుభక్తిసలుపుచుండ హఠాత్తుగా తురుష్కులు శ్యామసుంద రుని దౌలతాబాదునకుఁ జెరఁగొనిపోయిరి. ఇందుండినయేను తమయనుజ్ఞఁగొని యేగినవాఁడనందు భృత్యవేషమునకుఁదగిన

బాబాహుస్సేనుఁడనుపేరఁ బరిచారకుఁడనై సహచరుఁడగు భాజాహుస్సేనుకంటఁదుమ్ముఁగొట్టి, శ్యామసుందరుని చెరవిడిపించుకొని మఱల నోరుగల్లుఁజేరి సదాశివరాయలేనైతి. నిన్నటి యోరుగల్లుముట్టడియందు సక్రోధులై ప్రాణములకుఁ దెగించి, దురమొనరించినయోధులం దొక్కరుండనై నేఁడీసభాగారమున నాయుదంతమును జెప్పుచుంటి. నేనే యారఘునాథశర్మను.

రఘునాథశర్మపరోపకారబుద్ధిని సభ్యులు వినుతించిరి. అతని స్వమతాభిమానమునకు లోకమానందించెను. ధైర్య సాహసములను ప్రభుభక్తిని దలచి రాయలును సామంతులును కడుశ్లాఘించిరి. అంత శ్యామసుందరుఁడు తనయిరుకరంబుల జోడించి యిట్లువక్కాణించెను.

సార్వభౌమా! సభ్యులారా! మీరీవఱకు రఘునాథ శర్మచేవిన్న శారదగాథ యగాధమైనది. ఆమెనుగూర్చి మీప్రోల నించుకవిన్నవించవలసియున్నది. మొఘలులదుండగములకుఁదొలఁగియేగినశారద, పరోపకారమత్యంతాచరణీయమని మానసమునందెంచినశారద, తానెన్నియిడుమలుగుడుచుచున్నను, వీరపురుషోచితరూపమునుధరించి కేరళమున కేగుచుండె. మృగయావినోదమునఁ దమిఁగొన్న కేరళనరసింహరాయల కొక కిటిమూలమునఁబ్రాణాపాయమొదవనున్నఁ గాంచి చేనయినసాయమొనర్చియాయాపాయమునుండి తొలఁగించెను. ప్రత్యుపకృతిగా నాసామంతప్రభువు కేరళపువాహినీపతిగానుండునటుల నాశ్ర

యంబిచ్చె. అందుఁగొంతకాలముసుఖమై కాలంబువెళ్లఁబుచ్చు చుండెనుగాని యహమ్మదుఖాజీలపాలిటిధూమకేతువై మొఘులు వాహినిని నిర్ధూమధామమొనర్చు కాలమెపు డరుదెంచునని యెదురుఁజూచుచుండె. హఠాత్తుగా ఆశారదా విషయముననే బహమినులకును విజయనగరపుసార్వభౌములకును మనస్తాపము లుదయించి, ఇరువీరులుఁ బోరుదినముసమీపింప కేరళనాయకుచే ననుజ్ఞాపితులై తమతో నరుదెంచి యాగ్రోన్నకొదమ సింగంబు పగిది, వీరవిహారమొనర్చి రణరంగమునఁబేరొందెఁగాని, తనుఁ బట్టఁబన్నినవలయందుఁ దాఁబడ్డలేడివలె ఖాజీవజీరులుపన్నిన మాయావాగురులందుఁదవిలి దౌలతాబాదునకుఁజెఱఁ గొనిపోబడియె. శారదబంధవిముక్తినిఁగూర్చి మీరిదివఱకే రఘునాథ శర్మగారిచే వింటిరిగదా?

ఓరుగంటిని ముట్టడించిన ఫిరోజిషాహాసేనలఁగాంచి కృష్ణదేవులు భయాకులితమానసులైరి దుస్సహావమానమునకుఁ బాల్పడుదుమని శంకించుచున్న కృష్ణదేవులకు ధైర్యమును నెలకొల్పి ఒకచారునితోఁగూడ మార్గముగుండా పురిబాహ్యప్రదేశమునఁజేరె. తనప్రయత్నముసాధింప నాతురముననున్నదగుట ఓరుగంటినిఁ గాపాడ రాయలను రాణువను బంచె. అంతట నిల్వక కేరళమునుజేరి నరసింహరాయలకీయుదంతమంతయు విన్నవిచించె. వారియాదరమున మితిలేనిసేనలఁ గూర్చుకొని మొఘులువాహినిపైఁబడి కదనరంగమున కత్తులపచ్చడియొనర్చె నోయన సేనలఁజెండాడి తుదకుఁ దనుబంధించిన వజీరు ననిఁ

గూర్చి ప్రభుభక్తిసెరపెను. నేనే శారదాస్వరూపమునుమఱుగు పఱచిన యాశ్యామసుందరుఁడ. అని మోమువాంచి క్రిందుఁ జూచుచుండెను.

"ఆహా! శారదా యెన్నిదినంబులకు నీముఖారవింద సందర్శనంబు లభించుభాగ్యంబు నాకబ్బె! ఎంత కాలమునకు శ్రవణానందకరంబగు నీసుభాషామధురోక్తులాలకించు సౌఖ్యంబుఁ బడయఁగంటి! యుష్మత్‌దర్శనాపేక్షకుఁడనై, యడవులుదిరిగి, గిరులెక్కి, కోనలుఁబరికించి, గుహలుశోధించి, రహస్యస్థలంబు లారసి, విఫలమనోరథుఁడనై తుదకీసభాభవనమున నినుగాంచి ధన్యత సంపాదించిన యీదినమెట్టి సుదినము! రాజరాజుల మ్రోల, సామంతప్రభువుల ప్రత్యక్షమున, అమాత్యవరులకట్టె దుట, సభ్యులసమ్ముఖమున, నీసుశీలత్వమునుగూర్చియు, నీధైర్య సాహసాదిసద్గుణంబులఁ దలంచియు, నీచాకచక్యంబులకానం దించుచు, నినుఁబ్రశంసించెడి యుమ్మహాపురుషులందు, నీనిజ చరితమును విప్పిచెప్పిన యీతరుణమునఁగాదె యీవులేనిమా న్యుఁడనైతినని నేగర్వపడుట" అనితనలోననుకొనుచు సింహాద్రి నిర్భరానందవివశుఁడయ్యెను.

రాయలమితానందపరవశులైరి. శీలవతియన్న నీమెయే కదా శీలవతి? యనిసామంతప్రభువులు వేడుకపడుచుండిరి. శారద రాజభక్తికి సభ్యులు సంతసించిరి. అందఱు కరతాళధ్వనులాచ రించుచు నానందాబ్ధిఁ దేలియాడిరి. ఆనందరాయా! నీచరిత

మునుగూడవిన్నవించి పీనులవిం దొనర్పుమని రాయలనెను. ఆనందరాయఁడు కేలుమోడ్చి యిట్లు విన్నవించెను.

మహీపతీ! శారదాసింహాద్రులవియోగదుఃఖముభరింప రాక బెంగఁగొన్నజానకి, యగ్రపిత్రవ్యునిరక్షణార్థమై పానుగల్లు సందేయుండె. ఒకయపరాహ్ణమున ఖాజీయహమ్మదులు తద్గృహమునకువిచ్చేసిరి. జానకిజ్యేష్ఠపిత గౌరవపూర్వకంబుగా ప్రభుభక్తినెరపెను. సంతుష్టాంతరంగులువోలె నాతనిసంభావించి వెడలిపోయిరి. ఆరాత్రియె కొందఱుభటు లరుదెంచి నిశీథిని మందిరముఁజొచ్చి జరాభారపీడితులగుజానకిమాతాపితలకుత్తుకలు త్తరించిరి. ఆయనర్థమును గన్నులారఁగాంచినజానకి పరితాపమెక్కుడగుడుఁదలమోదుకొనుచు బావురుమనియేడ్వఁదొడఁగె. చారులిర్వురుఁ బట్టిబంధించిరి. పైనవిర్వురుసేవకులుండి నోటగుడ్డలుగ్రుక్కిరి. భీతియో పరితాపమో దిగ్భ్రమయోగాని. ఒడలెఱుంగక పుడమిపైఁ బడి యామె స్మృతివీడెను.

మూర్ఛదేరి కనుదెఱచిచూచునంతకు నౌకప్రమోద భవనముననుండఁగాంచె. భీతచిత్తయైకొంతవడికల్లే ప్రాణములు బిగ్గగట్టియుండ,యువరాజరుదెంచి తన్నుగుసలాయించె.లాలించె. బేలించె. భయపెట్టె. తుదకుఁ బతిమాలె. ఏమొనర్చిననేమి! పవిత్రవంతమగు రెడ్ల కులజయగుజానకి పాలవంటి కులమునకుఁ గళంకంబుదెచ్చునా? వానిమోహవికారమునకు తనమానమే మందని మూర్ఖాఢకుండె. శారదనుజూపిననుసరే గాకున్న నను

వరించినచునసరే యనిషాహా ముష్కరపుపట్టుఁబట్టె. భరింపరాని పరాభవముపాలుగుదునుగదా యనునసుమానముద యించిన దగుట జానకివిచారాకులచిత్తయైయేమిచేయనుదోపమి మోము వాంచి కంటతడివెట్టె. జాలిఁగొని షాహా వెడలి పోయెగాని, రేపటికాలోచించుకొని ప్రత్యుత్తరమీకున్న బలవంతమునఁ బట్టిభంగపరతునని భీతిపెట్టియేగె. శీలసంరక్షణార్థమై జానకి దీర్ఘాలోచనాతత్పరయై మీఁదుఁజూచుచుండ ప్రొద్దెంత గడిచెనో దెలియదయ్యె. ఒకకొజ్జాయరుదెంచి బందీకృతమైనదాని దొల గించి యోరుగంటిమార్గమనుసరించుటయు, మార్గమధ్యమున వీరపురుషోచితవేషమూచి యోరుగంటి రాజును జేరుటయు నాంధ్ర తురుష్కులకు ముద్దగల్లున జరుగనున్న ఘోరసంగ్రామ మునకు కృష్ణదేవులచేననుపఁబడుటయు, నింతకుముందీరఘు నాథశర్మగారిచే విన్నవిషయములే. విజయనగరమునకు జానకి యేతెంచినపిమ్మట మొఘలులఁలతో కృష్ణయొద్దనఁ బోరుప్రారంభ మయ్యె. ఒకవిశ్రాంతిదినమున కృష్ణకుయామ్య దిశనున్ననిర్జ నారణ్యమునందలికాసారమునయోధయై వెలసినజానకి తనమలి నాంగమునుగడుగుకొనుచుండె. యువరాజగు హరిహరులందు లకేతెంచి యాప్రచ్ఛన్నరూపినిఁ గనగల్గుట గుట్టువెలువడియె. ఇర్వురిమానసములేకీభవించి యన్యోన్యానురాగములతిశయింప, యుద్ధావసానానంతర మతని వివాహమాడ నియ్యకొనియె. మొఘలులుండలి యీర్ష్యచే ముద్దగల్లు ముట్టడియందును, ఓరుగల్లు ముట్టడియందును. తనశక్తివంచనలేక రణమాచ

రించి ప్రభుభక్తి సారించె. ఇంతియు జానకి వృత్తాంతము. ఈ రహస్య మెవరికిని దెలియలేదు యువరాజునకి!

హరిహరుని మోమునందు వికాసము దయించెను. వీక్షణా ప్రచారము జానకి వంక మరల మరల మరలుచుండెను. రాయలు జానకీహరిహరుల వదనేందీవరములఁ గాంచి మందహాసము నరించుచుండెను. యువరాజు సిగ్గునఁ దలవంచుకొనుచుండెను. సామంత ప్రభువులానంద మగ్నులై యుండిరి. సింహాద్రిచరిత మందటికిని విదిత మైయుండెను. దేవరాయ లానల్వురి యోధులను గాంచి యిట్లనియెను.

యోధాగ్రేసరులారా! మీదివ్యచారిత్రము లమోఘములు. వీరరసప్రభామిళితములు. నీతిమార్గనిధానములు. రాజభక్తియుక్తములు. లోకస్తుత్యములు. అనవరత చింత్యములు. నిరుపమానందదాయకములై యెల్లర నన్నివిధములఁ బ్రమోదవార్ధిఁ దేల్చినవి. రణవిద్యాకోవిదులారా! నగమంతదైవమునకు నలునంతపత్రియన్నట్లు మీమహోపకారమునకుఁ దగినసాధ్యోపకృతిచే సన్మానింపనెంచితి. రఘునాథశర్మగారూ! ముందుమీ యీప్సితమును వెల్లడింపుఁడు:

వసుంధరాధిపా! మీయాశ్రయమున జీవింపనుండుటఁ దప్ప వేఱొండు నేనభిలషింపను.

అందులకభ్యంతరమున్నదా? ఆస్థానపండితులరై యలరు చుండుఁడు.

శారదాస్వరూపమును మఱుఁగుపఱిచి పారావతముపై శరవేగమునఁ బాఱుసాళువంబు భంగి మొఘలువాహినినిఁ గకావికలుగావించి సభామధ్యంబున నిశీధినడచివెడలు మార్తాండు వోలె వెలసెడి శ్యామసుందరమూర్తీ, ప్రభుచంద్రులు నినుఁ బరిణయమాడఁగాక్షించుచున్నారు. లోకమంతయు, నీశీలవర్తనమును వేనోళ్ల వినుతించుచున్నది. ఏరాజుకరంబుఁబట్టి వెలయనుంటివో ఎవ్వనివంశంబుఁ బావనంబొనర్చి పుట్టినింటికిని జేపట్టినయింటికిని నిండు కీర్తినిఁ దేనుంటివో? ఏరి నాశ్రయించి క్షేమకరముగా నీజీవయాత్రఁ గడుపనుంటివో? ఎద్దానిం గోరి నా మనంబున కానందంబుగూర్పనుంటివో? నీవడుగుటకు సిద్ధపడిన నేనిచ్చుటకు బద్ధుఁడను.

రాజమార్తాండా! క్ష్మాపాలుర వరించి యంతిపురమను చెఱసాల నిరంతరబందీకృతనగుటకంటెను, సామాన్యమానవుని వరించి యిచ్ఛావినోదినై విహరించుటయే నాతలంపు. రెడ్లకులజనగుటకు నావంశమున మఱింతవన్నెవెట్టుటయే నాయభీష్టము. నావియోగదుఃఖమునఁ బడరానిబాములఁబడి, దేశభ్రష్టుఁడై, ప్రాణములకుఁ దెగించి మొఘలులతోఁ బోరి, నన్నే తనప్రాణమునకుఁ బ్రాణముగా నెన్నిన సింహాద్రిరెడ్డిని వరించి మీకు మోదమునుగూర్పనుంటిఁగాన ఓదయామయా! నా యీవరంబుఁ బ్రసాదింపఁ బ్రార్థించుచుదాన.

అట్లున్న నీయభీష్టమే ఫలప్రదంబగుగాత! సింహాద్రీ! శారదను గొందువే?

సిం—రాజేంద్రా మహాభాగ్యము.

విభా. నామనవి యొక్కటి ఆలకింపవేడువాఁడ. తర్వాత తగవులాట తగనిపని. పదిమంది సభ్యులసమక్షముననే నాయీాప్సితమును నేఱవేర్పుఁడు. రాజులు బహుకార్యమగ్నులగుట ననుమఱచిపోవుదురు.

విభావసూ! నీవడిగినదెద్ది? నేను లేదన్నదెద్ది?

అందులకే మున్ముందుగా నెచ్చరించుచున్నాను. ఏమందురా? శారదను సింహాద్రికొసంగుట నామొదటియీాప్సితము, ఈ బాల్యదంపతుల యద్దుముద్దుగని మనమానందింప వీరియుద్వాహ మీా విజయనగరమందే జరిపించుట రెండవకోరిక. వివాహదినములలో భోజనపంక్తిని మొదటివిస్తర నాయదిగా నుండవలయు. పిండివంటలు సమృద్ధిగా వడ్డించవలయు.

అనవిని సభ్యులందఱు నానందించిరి.

జానకీ! నాయనుంగుఁగోడలవై మన్మందిరము పావనంబొనర్పనుంటివి. నీాఁదు మిక్కిలిగాఁ గోరుకోర్కెలెవ్వియో గోరుకొనుము.

లోకపాలనా! ప్రచ్ఛన్నవృత్తి బయలయ్యెననుభీతి నను బాధింప విధిలేమి నేనీయువరాజునకు వాగ్దానమొనర్చి కదనాం

తమువఱకు నవధిగొన్నది నిజము. హరిహరులందనురాగనగు టయునిక్కము. అయినను నేనస్వతంత్రను. అగ్రజుఁడున్నాఁడు. అన్నయనుజ్ఞగొనుటయే నాయభిమతము.

జానకీ! నీభాగ్యముపండినది. ఇంతకన్నను నీకనుగుణు లెవరు? అని సింహాద్రి పలికెను.

అంత దినమణి యపరాద్రి కరిగెను. రేపు వివాహ ముహూర్తములని రాయలుపలికి యానాటిసభ చాలించిరి.

---

# ఇరువదవ ప్రకరణము

## వివాహము

విజయనగరమునందే ఒకశుభముహూర్తమున శారదా సింహాద్రులకును, జానకీ హరిహరులకును మహావైభవముతో నుద్వాహములయ్యెను. శారద మాతాపితలు, జామాతను గూతును గని పరమానందభరితులైరి. దేవరాయసార్వభౌముఁడు స్వయముగా నరుగుదెంచి యమేయములగు బహుమతులను వధూవరులకొసంగి గౌరవించెను. సింహాద్రి శారదాసహితుఁడై పానుగల్లునుజేరి నిరంతరసౌఖ్యాబ్ధి నోలలాడుచుండెను. వీరాంగన యగు శారద నిరంతరము ధర్మకార్యములాచరించుచు ప్రజా సేవసేయుచుఁ గాలము వెళ్లపుచ్చుచుండెను.

1422 సం॥ ఫీరోజిషాహా కీర్తిశేషుఁడగుటచే నహమ్మదు షాహా సుల్తాను బిరుదమందెను. చచ్చియుఁ బునర్జీవితుండగు వాని దుండగములనడంచి, కర్ణాటకరాజ్యరమారమణుఁడై, సంస్కృతాంధ్రకర్ణాటకభాషాత్రయంబు నభివృద్ధినొందింపుచు శ్రీదేవరాయసార్వభౌముఁడు ప్రజారంజకుఁడై రాజ్యమేలు చుండెను.

శారదావిజయము

సంపూర్ణము.

---

శ్రీ ఆదిమూలం ముద్రాక్షరశాల, చెన్నపురి.

